


సంపుటి: 3 సంచిక: 2 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 మార్చి 2017



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhra Pradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

వీరాంజనేయులు : 7799260684

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖచిత్రం
ఉగాది పండుగ
చిత్రకారుడు: శంకర్, 9032891700

90




---

కరే శ్లాఘ్యస్త్యాగః శిరసి గురుపాద ప్రణయితా
ముఖే సత్యా వాణీ విజయి భుజయోర్వీర్యమతులమ్ ।
హృది స్వచ్ఛా వృత్తిః శ్రుతిమధిగతం చ శ్రవణయోః
వినాప్యైశ్వర్యేణ ప్రకృతి మహతాం మండనమిదమ్ ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

ఆపదలందు ధైర్యగుణ మంచిత సంపదలందు దాల్మియున్
భూప సభాంతరాళమున బుష్కల వాక్చతురత్వ మాజి బా
హాపటు శక్తియున్ యశమునందనురక్తియు విద్యయందు వాం
ఛాపరివృద్ధియున్, బ్రకృతి సిద్ధగుణంబులు సజ్జనాళికిన్

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం:

ఆపదలు వచ్చినప్పుడు ధైర్యము, సంపదలు వచ్చినప్పుడు స్నేహభావము, సభలలో పుష్కలమైన వాక్చాతుర్యము, యుద్ధంలో పోరాడేటప్పుడు దానికి అవసరమైన శక్తి, కీర్తి యందు ఇష్టము, విద్య సంపాదించటంలో తీవ్రమైన కోరిక- ఇవన్నీ మంచివాళ్ళకు సహజ గుణాలు.



# మళ్లీ వచ్చిన వసంతం

మంచు విడిపోయింది. వాడిపోయిన ఆకులన్నిటినీ రాల్చేసి, బోడిగా మిగిలిన చెట్లన్నీ ఇప్పుడిప్పుడే మళ్లీ కొత్త చిగుర్లు వేయటం మొదలెట్టాయి.



ప్రొద్దునే పక్షుల కిలకిలలు మొదలయ్యాయి, ముఖ్యంగా కోయిల కూతలు! మామిడి చెట్లని చూస్తే ముచ్చట వేస్తున్నది: లేత ఆకుపచ్చరంగులో మెరిసే ఆకుల సొగసు బలే ఉంది. చిట్టి చిట్టి మామిడి కాయలు వచ్చాయి. ఇన్నాళ్ళూ ఎక్కడో దాక్కున్న మొక్కలు ఇప్పుడు మళ్లీ అందరికీ కనిపించాలని ముస్తాబవుతున్నట్లు ఉన్నాయి. నేల బారుగా పరుచుకున్న గడ్డి మొక్కలన్నీ రంగురంగుల పూలు తొడిగాయి. ఇంట్లో చాలా రోజులుగా ముడుచుకొని ఉన్న గులాబి మొగ్గ ఇవాళ్లే విచ్చుకున్నది. అందమైన రెక్కల్ని

సవరించుకుంటూ అన్ని వైపులకూ కలయ జూసింది. క్రింద, నేల బారుగా పరచుకొని ఉన్న గడ్డి చేమంతుల్ని చూసీ చూడనట్లు చూసి, 'తన స్థాయి వాళ్ళు కారు' అన్నట్లు వేరే వైపుకు తల తిప్పుకున్నది.

దగ్గర్లోనే ఉన్న గడ్డి చేమంతి నవ్వుతూ పలకరించింది దాన్ని. "బాగున్నావా, చెల్లెమ్మా?! ఎంత అందంగా ఉన్నావమ్మా! నిన్ను చూస్తే మా అందరికీ ఎంతో గొప్పగా ఉంటుంది" అన్నది స్నేహంగా.



గులాబీ దానికేసి తిరస్కారంగా చూసింది- "మావాళ్లెవరూ ఇంకా వచ్చినట్లు లేరు?!" అంటూ మూతి ముడుచుకున్నది.

"గులాబీలా?! లేదమ్మా! ఇంకా లేదు. నువ్వే, మొదటి దానివి! మా గడ్డిచామంతులైతే దండిగా వచ్చేసాయి!" చెప్పింది ఆ పువ్వు. "ఇంకా లిల్లీలు కూడా రాలేదు. ఈ పాటికి వచ్చేయాల్సింది మరి-"

"వచ్చేసాం! వచ్చేసాం!" వినిపించింది ఒక గొంతు. చూడగా అది లిల్లీ! లిల్లీ పువ్వు గొంతు విప్పగానే సుగంధాలు అక్కడ అంతటా పరచుకున్నాయి. "బాగున్నారా అంతా?! వసంతంలో మేమూ మీరూ అందరం ఎన్నెన్ని కబుర్లు చెప్పుకున్నామో, గుర్తుందా?" అన్నదది.

గులాబీ తిరస్కారంగా ముఖం తిప్పుకున్నది. "వికారపు పూలు, వికారపు మాటలు!" అనుకున్నది. "ఆశ్చర్యమేమున్నది? అందరూ గులాబీలనే ఇష్టపడుతారు ఇందుకనే!"

అంతలో తొలి కిరణం ఒకటి వచ్చి వాలింది. అది రాగానే అక్కడంతా వెచ్చదనం పరుచుకున్నది. "ఏమ్మా! అంతా బాగున్నారా?" అన్నది తొలి కిరణం. అట్లా అంటూనే

మరోవైపున గులాబీతో గుసగుసగా చెప్పింది- "నాకు మాత్రం నువ్వంటేనూ ఇష్టమే; గడ్డి చేమంతులన్నా ఇష్టమే; లిల్లీలంటే కూడా ఇష్టమే!" అని.

గులాబి ముఖం ఇంకా ఎర్రగా ఐపోయింది. "కాదు! నేనొక్కదాన్నే అందమైన దాన్ని! అందరికీ నేనంటేనే ఇష్టం కావాలి! అంతే!" అని అరిచింది. ఆ అరుపుకు మిగిలిన పూలన్నీ బెదిరిపోయాయి. చిన్నబోయి చటుక్కున తలలు వాల్చుకున్నాయి.



అంతలో గందరగోళంగా, రంగులు రంగులుగా ఎగురుకుంటూ వచ్చింది, ఓ సీతాకోక చిలుకల దండు. అన్ని పూల మీదా వాలి, అన్నిటితోటీ ముచ్చట్లు పెట్టాయవి.

"కాదు- అందరూ నా దగ్గరికే రండి!" అని అరుద్దామనుకున్నది గులాబీ. అయినా "అన్నీ ఒకేసారి వచ్చి పడితే ఎలాగ?" అని ఊరుకున్నది.

సీతాకోక చిలుకలు, ఆ తర్వాత తుమ్మెదలు, తేనెటీగలు- అన్నీ వచ్చి సందడి చేసినై; పూలన్నిటినీ పేరుపేరునా పలకరించినై; ఎక్కడెక్కడి సంగతులూ చెప్పినై వాటికి! సంతోషం నిండిన ఆ వాతావరణంలో గులాబీ కూడా 'తను వేరు' అనుకోవటం మర్చిపోయింది.

ఆ రోజు రాత్రి పడుకోబోతూ, "సువిశాలమైన యీ ప్రకృతిలోని అనంత వైవిధ్యంలో నేనూ ఒకదాన్ని !" అనుకున్నది అది తృప్తిగా.

నిజంగానే సంతోషం అన్ని భేదాలనూ పోగొడుతుంది!

మీకందరికీ నవ వసంతపు శుభాకాంక్షలు!!

కొత్తపల్లి బృందం



# గజదొంగ గంగన్న కథ

కొత్త బేతాళం

*పట్టు వదలని ఇన్‌స్పెక్టర్ విక్రం మళ్ళీ ఓసారి చెట్టెక్కి, రోబో బేతాళాన్ని క్రిందికి దింపగానే, అప్పటి వరకూ పవర్ లేనట్లు పడి ఉన్న రోబో ఒక్కసారిగా ఒళ్ళు విరుచుకొని వికవికా నవ్వింది.*

"మళ్ళీ వచ్చావా విక్రం?! సిద్ధప్ప ఎట్లాంటివాడో నీకు ఎన్ని విధాలుగా చెప్పినా అర్థం అవుతున్నట్లు లేదే?! మంచి పేరు, డిగ్రీలు ఉన్నంత మాత్రాన మంచితనమూ, జ్ఞానమూ ఉన్నట్లు కాదు. ఈ సంగతి అర్థమయ్యేందుకు గాను నీకు గజదొంగ గంగన్న కథ చెబుతాను విను" అంటూ ఇలా చెప్పసాగింది..

గజదొంగ గంగన్న మరణ శయ్యమీద ఉన్నాడు. అతని అనుచరులు పదిహేను మందీ అతనున్న గది గోడలకు ఆనుకొని నిలబడి ఉన్నారు, విచారంగా. గంగన్న కొడుకు రంగన్న తండ్రి పడుకున్న మంచం కోడుమీద కూర్చుని, తండ్రి చేతుల్ని తన చేతిలోకి తీసుకొని నొక్కుతున్నాడు. అతని కళ్లలో నీళ్లు సుడులు తిరుగుతున్నాయి.



పదహారేళ్ల రంగన్న, తండ్రి అడుగుజాడల్లో నడిచాడు, చాలా ఏళ్లుగా. గంగన్న అనుచరులు పదిహేను మందికీ అతను దైవమే. ఎవ్వరూ అతని మాట జవదాటరు.

తండ్రి తదనంతరం అతను నెలకొల్పిన చోర సామ్రాజ్యం యావత్తూ రంగన్న సొంతం అవ్వనున్నది. ఇప్పుడిక అతను దాన్నంతా ఏలాలి- తండ్రి సాయం లేకనే.

గంగన్నకు ఒక దగ్గు తెర వచ్చింది. దగ్గి దగ్గి మెలికలు తిరిగిపోయాడు. తన పని ఐపోయిందని అర్థమైంది. కొడుకుని దగ్గరగా వంగమని సైగ చేసాడు. రంగయ్య వంగి, తన చెవుల్ని తండ్రి నోటికి దగ్గరగా తెచ్చాడు. అందరూ తలలు వంచుకొని, నాయకుడు చెప్పే చివరి పలుకుల్ని ఆలకిస్తున్నారు శ్రద్ధగా.

గంగన్న మొదలుపెట్టాడు- "నాన్నా, రంగూ! నేను జీవితంలో చాలానే సాధించాను. మా నాయన నాకు కనీసం ఒక ఇంటిని కూడా ఇవ్వలేదు. జేబులు కొట్టటం నుంచి, చిన్నా చితకా దొంగతనాల్లోకి, అక్కడినుండి దోపిడీలలోకి అలవోకగా, అత్యంత సాహసో-

పేతంగా ప్రవేశించాను. నేనుండే దారుల్లోంచి వెళ్లాలంటే బాటసారులంతా వణికి పోయేట్లు చేసాను. శాస్త్రాల్లో దొంగ తనాల గురించి చెప్పిన మెళకువలన్నీ ఒక్కటీ పొల్లు పోకుండా ఆచరణలోకి తెచ్చి చూపించి- ఇదిగో, యీ పదిహేను మందికీ తిరుగులేని నాయకుడినైనాను."

రంగన్న ఆయాసంతో కొంత సేపు దగ్గాడు. చుట్టూ అందరూ ఇంకా బాధగా ముఖం పెట్టారు. ఒక్కో అక్షరం కూడగట్టుకొని కొనసాగించాడు గంగన్న-

"రంగూ! మన యీ ఊళ్లల్లో జనాలంతా నా పేరెత్తితే చాలు- వణికిపోయేట్లు ఏలాను ఇన్నేళ్ల పాటు. ఇప్పుడు ఇదంతా నీకు ఇస్తున్నాను. ఎట్లా చేసుకుంటావో, నీ ఇష్టం. నిన్నిప్పుడు నేను కోరేది ఒక్కటే- నాకు మంచి పేరు తేవాలి నాన్నా! అందరూ గజదొంగ గంగన్న గురించి మంచిగా తలచుకునేట్లు చెయ్యి. ఇంతకు మించి నాకు ఏ కోరికా లేదు" అని చెప్పి కన్నుమూసాడు.

అందరూ గొల్లుమన్నారు. రంగన్న తండ్రి అంత్యక్రియల్ని ఘనంగా నిర్వహించాడు. తండ్రి ఆఖరి కోరికను తీర్చాలనుకున్నాడు. "ఏం చేస్తే, అందరూ మా నాన్న గురించి మంచిగా అనుకుంటారు?" అని అడిగాడు అనుచరుల్ని.



ఒకడన్నాడు-" ఊరూరా విగ్రహాలు పెట్టిద్దాం" అని.

"ఊహుఁ" అన్నాడు రంగన్న.

"ఊరూరా ఆయన పేరు మీద బడులు, గ్రంథాలయాలు కట్టిద్దాం" ఇంకోడన్నాడు.

"బాలేదుఁ" అన్నాడు రంగన్న.

“గంగన్న పేరిట విద్యార్థులకు స్కాలర్షిప్పులు ఇద్దాం” అన్నాడు మరొకడు.

“ఉహుఁ” అన్నాడు రంగన్న.

ఇట్లా ఎవరు ఏం చెప్పినా రంగన్న మెచ్చలేదు. చివరికి ఒక నిశ్చయానికి వచ్చినట్లు తలూపి, "అందరూ నేను చెప్పినట్లు చేయండి. ఇదివరకటి కంటే ఇంకా ఎక్కువ జేబులు కొట్టండి. ఎక్కువ దారి దోపిడీలు చేయండి. బందిపోటు పనుల్లోకీ దిగుదాం. బందిపోటు రంగన్న అంటే పిల్లలు, పోలీసులు కూడా వణికి పోయేట్లు చేద్దాం. ఇంక ఆగేది లేదు- తక్షణం మొదలు పెట్టండి!" అని ఆదేశించాడు రంగన్న. అనుచరులంతా జయ జయ నినాదాలు చేసారు.

ఇంతవరకూ చెప్పి, బేతాళం "అయినా జీవితమంతా దొంగ బ్రతుకు బ్రతికిన గంగన్నకు చరమాంకంలో మంచి పేరు అవసరం ఏమొచ్చింది? అది అతనిలోని బలహీనతకు, నిస్సహాయతకు ప్రతీక కాదా? ఇక తండ్రికి మంచి పేరు తెస్తానని మాట ఇచ్చిన రంగన్న చివరికి చేసిందేమిటి, స్వార్థం చూసుకోవటం తప్ప?” అని అడిగింది.

విక్రం చిరునవ్వు నవ్వి- “అట్లాంటిదేమీ లేదు- జీవితాంతమూ గజదొంగగా బ్రతికిన గంగన్నకు వేరే మంచి పేరు అవసరం ఏమీ లేదు: దొంగగా తనకు గొప్ప పేరు తెచ్చి పెట్టమని అతని ఉద్దేశం. ఆ సంగతి అర్థమైన కొడుకు అతని కంటే దుర్మార్గుడిగాను, క్రూరుడుగాను పేరు తెచ్చుకోవటం ద్వారా, ప్రజలకు 'తనకంటే తన తండ్రే నయం- 'గంగన్న అని చాలా మంచోడు పాపం, ఇప్పుడు చచ్చిపోయాడు' అనిపించేట్లు చేసాడు. అట్లా జనాలు గంగన్నను మంచిగా గుర్తు చేసుకుంటారు కద! దుర్మార్గుల మన:ప్రవృత్తి ఇంతకంటే వేరుగా ఉండే అవకాశం లేదు" అన్నాడు.

ఆ సమాధానం సరైనదేనని గుర్తించిన బేతాళం అతని పట్టునుండి తప్పించుకొని చటుక్కున మళ్ళీ చెట్టెక్కింది.

(ఆధారం: యు. సుబ్బరాజు చెప్పిన కథ)



# బంగారు గరిటె

*రచన: వైష్ణవి, రిషీ వ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.*

అనగనగా ఒక ఊళ్లో ఒక అవ్వ ఉండేది. ఊరి పొలిమేరల్లో నివసించే ఆ అవ్వను అందరూ ఊరికే 'పేదరాసి పెద్దమ్మ' అని పిలిచేవాళ్ళు; కానీ ఎవ్వరూ నిజంగానైతే ఆ అవ్వను పట్టించుకునేవాళ్లు కాదు.

వ్యవసాయం పనులు ఉన్నప్పుడు కూలీగా వెళ్తుండేది అవ్వ. చక్కగా శ్రమపడి నడుం వంచి పని చేసేది. అట్లా వచ్చిన డబ్బులతో ఆదివారం రోజున సంతకు పోయేది; వారానికి సరిపడా సరుకులు తెచ్చుకునేది. పండగ ఉండే వారాల్లో ఎక్కువ సరుకులు- ఎందుకంటే పండగ రోజున ఎవ్వరైనా అవ్వ ఇంటి ముందు నిలబడి అడిగితే లేదనేది కాదు: వాళ్లను ఇంట్లోకి పిలిచి కడుపు నిండా

భోజనంపెట్టి గానీ పంపేది కాదు.

అట్లా ఓసారి అవ్వ తను వారమంతా కష్టపడి కూడబెట్టిన సొమ్ముతో పండగ సరుకులు తెచ్చుకున్నది. ఆ రోజే పండగ. అవ్వ తినేందుకు పులిహోర, రవ్వకేసరి చేసుకున్నది. ఆ రోజంతా ఎవరైనా వస్తారేమోనని ఎదురు చూసింది పాపం. సాయంత్రం వరకూ ఎవ్వరూ రాలేదు గానీ, ఇక చీకటి పడుతున్నదనగా దూరదేశం నుండి ఎవరో పండితుడు ఆకలితో వచ్చి 'తినేందుకు ఏమైనా ఉందా తల్లీ?!' అని అడిగాడు.

అవ్వ ఆయన్ని లోపలికి ఆహ్వానించి తను చేసిన కేసరి పెట్టింది తినేందుకు. కేసరి అంతా తినేసాడాయన. అన్నం పెడితే అంతా అయిపోచేసాడు. పండగకు చేసిన అన్ని పదార్థాలూ తినేసాడు. అయినా ఇంకా ఆయన ఆకలి తీరినట్లు అనిపించలేదు. ఆలోగా అవ్వ తను వారమంతా గడిపేందుకు తెచ్చుకున్న కూరగాయలన్నీ వండింది. ఇంట్లో ఉన్న బియ్యమంతా వండి వార్చింది. మొత్తం ఆయనకు వడ్డించింది.

పండితుడు ఆమెకేసి సంతోషంగా చూసి, ఏమి పెడితే అదంతా తినేసాడు గబగబా. పెడితే ఇంకా తినేట్లు అనిపించాడు!



అవ్వకి ఇంక ఏం చేయాలో పాలు పోలేదు. ఏమంటే ఆ సరికి ఇంట్లో తను కూడబెట్టుకున్న సరుకులు, కూరగాయలు అన్నీ అయిపోయాయి; బియ్యం కూడా ఖాళీ! డబ్బులూ లేవు!

ఇక మిగిలిందల్లా అవ్వకు వారసత్వంగా వచ్చిన పెద్ద గరిటె మాత్రమే. ఆ గరిటె అంటే

అవ్వకు చాలా ఇష్టం. ఇన్నేళ్ళుగా దాన్ని చాలా భద్రంగా చూసుకుంటూ ఉండిందామె. అయితే ఇప్పుడు ఆమె చటుక్కున పోయి, దాన్ని అయిన లెక్కకు అమ్మేసి, ఆ డబ్బుతో కూరలు, సరుకులు తీసుకొచ్చి పండితుడికి వండి పెట్టింది.



పండితుడు ఆమె వంటని మెచ్చుకుంటూ తిని, చెయ్యి కడుక్కుంటూ "తల్లీ! ఉన్నదంతా నాకే పెట్టినట్లున్నావు. మరి నీకు?" అని అడిగాడు.

"ఇవాళ్ళ పండగ కదా, స్వామీ! ఇవాళ్లంతా ఉపవాసం ఉండి, రేపు తింటాను నేను" అన్నది అవ్వ.

"మరి వంట చేసేటప్పుడు దేనితో కలుపుతావు తల్లీ?!" అడిగాడు పండితుడు.

"సండ్రకట్టెతో కలిపితే వంట చాలా బాగుంటుంది స్వామీ!" అన్నది అవ్వ టక్కున.

పండితుడు నవ్వి, "నేను చాలా ఊళ్ళు తిరిగాను తల్లీ! కానీ ఎక్కడా నాకు కడుపు నిండలేదు. ఇవాల్టి నీ త్యాగంతో నా ఆకలి తీరింది. ఇదిగో, నీకో బహుమతి" అని తన జోలెలోంచి ఒక బంగారు గరిటెని బయటికి తీసి అవ్వకు ఇచ్చాడు. "ఇదిగో తల్లీ! ఇక ఇది నీ గరిటె. దీనితో నువ్వు ఏమి వండినా అది అక్షయం అవుతుంది. అతిథి సేవకు ఇకపైన ఏ ఆటంకమూ ఉండదు" అని అవ్వను ఆశీర్వదించి, వెళ్లిపోయాడు.

ఆ తర్వాత ఇక ఆ దారిన పోయేవాళ్ళెవ్వరూ ఆకలితో పోలేదు!



# గొప్పలు చెప్పుకోవటం

*రచన: శ్రీ చాతుర్య, ఏడవ తరగతి, రిషీవ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.*

జమీందారు రంగారావుగారికి ఒక్కగానొక్క కూతురు లత. తను ఐదవ తరగతి చదువుతున్నది. లత ఎప్పుడూ గొప్పలు చెప్పుకుంటుండేది; తనను మించిన వాళ్లు ఎవరూ లేరని అనుకునేది. బడిలో తోటి పిల్లలతో ఎవరితోటీ సరిగ్గా ఉండేది కాదు. ఎప్పుడూ ఇతరులను చులకనగా చూసేది.

ఐదో తరగతిలోనే గీత, రమ్య, జ్యోతి అనే ముగ్గురు పిల్లలు ఉండేవాళ్ళు. వాళ్ళు ముగ్గురూ అందరితోటీ చక్కగా స్నేహంగా ఉండేవాళ్ళు.

లత మటుకు అవకాశం దొరికినప్పుడల్లా లత ఊరికే వాళ్లను ఆట పట్టిస్తూ ఉండేది: 'నువ్వు ఎంత పొట్టిగా ఉన్నావో చూడు!' 'నువ్వు బొగ్గులాగా ఎంత నల్లగా ఉన్నావు!' 'లావు- లావు' అంటూ వాళ్లను ఏడిపించేది.

అయినా వాళ్ళు పాపం మంచివాళ్ళు కదా, అందుకని లతని ఏమీ అనేవాళ్ళు కాదు.

ఆ పిల్లలు ముగ్గురూ సైకిల్ మీద బడికి వెళ్లేవాళ్లు. దారిలో ఒక చోట రోడ్డు ఎత్తుగా ఉండేది. అక్కడ మటుకు సైకిలు తొక్కటం బాగా శ్రమ అయ్యేది. అయితే లతకు ఆ శ్రమ లేదు. వాళ్ళ నాన్నకు కారు కూడా ఉన్నది: రోజూ వాళ్ల నాన్న లతని కారులో బడి ముందు దించి వెళ్ళేవాడు.

ఒక రోజు గీత, రమ్య, జ్యోతి ముగ్గురూ బడికి పోతుండగా, లత ఉన్న కారు వాళ్లని దాటుకొని ముందుకు పోయింది. అందులో కూర్చున్న లత వాళ్ల నాన్నని కారు ఆపమని; అద్దం దించి, తల బయటికి పెట్టి చూస్తూ- "ఏంటి?! మీరు సైకిళ్ళు ఇంత మెల్లగా తొక్కుతున్నారు?! నా దగ్గర కూడా ఒక సైకిల్ ఉంది. మీ సైకిళ్ల కంటే చాలా వేగంగా పోతుందది. రేపు నేను ఆ సైకిల్ వేసుకొని వస్తాను- అప్పుడు చూడండి, నా సైకిల్ ఎంత బాగుందో, నేను దాన్ని ఎంత వేగంగా తొక్కగలనో!" అన్నది గొప్పగా.

పిల్లలు ముగ్గురూ ఆ పాప మాటల్ని పట్టించుకోలేదు. అయితే పంతాలమారి లత మరుసటి రోజున బడికి నిజంగానే సైకిల్ మీద బయలుదేరింది!

కానీ అంతగా అలవాటు లేదు కదా, సైకిలు తొక్కటం పాపం బాగా కష్టం అయ్యింది తనకు. అయినా పట్టుదలగా ముందుకే పోయిన లతకు మెల్లగా సైకిళ్ళు తొక్కుకుంటూ పోతున్న గీత, రమ్య, జ్యోతి కనిపించారు.

అప్పుడిక లత గబగబా పోయి వాళ్ళను చేరుకొని, "ఇప్పుడు చూడండి! నా సైకిల్ ఎంత బాగా పోతుందో! నేను ఎంత వేగంగా తొక్కుతానో చూస్తూండండి!" అని గొప్పలు పోతూ, చకచకా వాళ్లను దాటుకొని ముందుకు వెళ్ళిపోయింది.

అయితే ఆ హడావిడిలో తన సైకిలు టైరుకు ఎదురుగా ఉన్న పదునైన రాయిని ఒకదాన్ని తను చూసుకోనేలేదు! సైకిలు ఆ రాయి మీదికి ఎక్కటం, ముందు టైరుకు గుచ్చుకొని పంచరవ్వటం, 'చుయ్య్...'

మంటూ గాలి పోవటం- అన్నీ టకటకా జరిగిపోయాయి!

ఆ శబ్దం ఏంటో కూడా తెలీదు లతకి. అయితే ముందు చక్రంలో గాలి పోయేసరికి బ్యాలన్సు నిలవలేదు- నాలుగు మెలికలు తిరిగి సైకిలు తటాలున క్రింద పడబోయింది! చివరికి ఎలాగో ఒకలా సైకిలును ఆపిన లత, 'ఇంక బడికి ఆలస్యం అవుతుంది- ఎలాగ?!' అంటూ ఏడవటం మొదలుపెట్టింది.

గీత, రమ్య, జ్యోతి "ఇప్పుడు ఏమైంది? ఎందుకు, ఏడవటం?!" అని అడిగారు. "సైకిలు పాడైంది! ఇప్పుడెలాగ? బడికి ఆలస్యమైపోతాను!" చెప్పింది లత, ఏడుస్తూ.

రమ్య ఆమెను ఓదారుస్తూ "ఏడవకు, ఏమీ పర్లేదు- నువ్వు నా సైకిల్ వెనక ఎక్కి కూర్చో. నేను నిన్ను బడికి తీసుకు పోతాను. వీళ్ళు నీ సైకిలును బడికి చేర్చుతారు" అని ఓదార్చింది.

"అవును లతా! ఏమున్నది, మేం తెస్తాంలే, నీ సైకిలును!" అన్నారు గీత, జ్యోతి.

వాళ్ల మంచితనం లత మొండి మనసును కరిగించింది. "నేను మిమ్మల్ని చాలా సార్లు వెక్కిరించాను. అయినా మీరు నాకు సహాయం చేస్తున్నారు. నన్ను క్షమించండి. నేను ఇంకెప్పుడూ ఎవ్వరినీ చిన్నచూపు చూడను" అంటూ క్షమాపణ కోరింది ఏడుస్తూనే.

గీత, రమ్య, జ్యోతి ఒకరి మొఖాలు ఒకరు చూసుకొని గట్టిగా నవ్వారు. "బలే ఉన్నావు తల్లీ! అంత పెద్ద పెద్ద మాటలు అవసరమా? పద- బడికి టైమైపోతుంది" అని లతని ఉత్సాహపరచారు. నలుగురూ ముందుకు సాగారు.

ఆ తర్వాత లత చాలా మారింది. పిల్లలందరితోటీ కలిసిపోయింది. అందరి కష్టసుఖాల్లోనూ పాలు పంచుకున్నది. ఇప్పుడు బళ్ళో ఆ పాపకు ఎందరు స్నేహితులో లెక్కలేదు!



# కాలం విలువ

*రచన: యస్.రాజేశ్వరి, 8 వతరగతి, జిల్లాపరిషత్ హై స్కూల్, పెద్దపసుపులగ్రామం.*

ఒక ఊరిలో రవి, శాంత అనే దంపతులు ఉండేవారు. రవి వ్యాపారంలో బాగానే సంపాదించాడు.

దంపతులు ఇద్దరూ చాలా పొదుపుగా ఉండేవాళ్ళు; కానీ వాళ్ళ కొడుకు సతీష్ మాత్రం చాలా దుబారాగా తయారయ్యాడు. వాడికి స్కూలుకి వెళ్ళడమంటే అస్సలు ఇష్టం ఉండేది కాదు. స్కూలుకు వెళ్తున్నట్టే వెళ్ళి, ఊరి చెరువు కట్ట మీద ఆడుకునేవాడు.

రాను రాను వాడికి చెడు సహవాసాలు అబ్బినై. బీడీలు, సిగరెట్లు త్రాగటం, సారాయి త్రాగటం లాంటి దురలవాట్లు వచ్చినై. వాటికి తోడు దుకాణంలోని

డబ్బును తీసుకెళ్ళి, తోచిన జూదాల్లోను, పందాల్లోను ఖర్చు చేయటం మొదలెట్టాడు.

కొడుకు దారి తప్పుతున్న సంగతి రవికి తెలిసినా, మొదట్లో పెడచెవిన పెట్టాడు. తన వ్యాపారపు పనుల్లో వ్యస్తంగా ఉంటూ, కొడుకు గురించి పెద్దగా పట్టించుకోలేదు.



తీరా వాడు ముదిరిపోయాక, అప్పుడు ముందుకొచ్చి "ఇలాంటి పనులు మంచివి కావురా" అని చెప్పి చూసాడు; తిట్టాడు; బెదిరించాడు; కొట్టాడు- ఏం చేసినా సతీష్ మాత్రం తన దారి మార్చుకోలేదు.

సతీష్ స్నేహితుడు మహేష్ అని ఒకడు ఉండేవాడు. "ఎందుకురా, ఇలా తయారవుతున్నావు? నేను పోవట్లేదా, స్కూలుకు? నువ్వూ రా, ఇద్దరం కలిసి వెళ్దాం! బాగా చదువుకుంటే మన కాళ్ళమీద మనం నిలబడచ్చు: లేకపోతే అందరితోటీ మాటలు పడుతూ బ్రతకాలి. కాలాన్ని వృధా చేయకు!" అనేవాడు.

"ఇదిగోరా, ఒరేయ్! నువ్వు చదువు; గొప్ప ఆఫీసరువవ్వు. నన్ను నా ఇష్టం వచ్చినట్లు ఉండనీ" అనేవాడు తప్ప, సతీష మటుకు వాడి సలహాలను పాటించేవాడు కాదు.

పదో తరగతి పాసవ్వగానే మహేష్ వేరే ఊరికి వెళ్ళిపోయాడు. పరీక్షలో తప్పిన సతీష్ ఊరికే పెద్దవాడయ్యాడు. ఊళ్ళోనే పెద్ద రౌడీ అయ్యాడు. తండ్రి సంపాదించిన డబ్బునంతా వ్యసనాలకు ధారపోసాడు. తల్లిదండ్రులు వాడిని తిట్టుకోని రోజు లేదు. అయితే బాగా చదువుకున్న మహేష్

పోలీసు ఇన్‌స్పెక్టరు అయి, అదే ఊరికి తిరిగి వచ్చాడు. ఊరి రౌడీల పట్టికలో సతీష్ పేరును చూసి, చాలా బాధ పడ్డాడు. అతన్ని పిలిపించి "సతీష్, ఎలా ఉన్నావురా? అమ్మ-నాన్నలు ఎలా ఉన్నారు?" అని అడిగాడు.



"వాళ్ళు నన్ను ఇంట్లోంచి తరిమేసారురా. అదే నా బాధ!" చెప్పాడు సతీష్, తల దించుకుంటూ.

"మరి తమిమెయ్యక ఎలా ఉంటారురా?! నువ్వు ఇట్లా చెడుపనులు చేస్తూంటే, ఎవరైనా ఎంత కాలం కాపాడతారు? అదే నువ్వు చిన్నప్పటినుండీ చక్కగా చదువుకొని ఉంటే, బాధ్యతగల మనిషివి అయ్యేవాడివి! ఇప్పటికైనా నా మాట విను- దొంగ పనులు మానేసి, ఏదైనా వ్యాపారం చేసుకో, నేనూ నీకు ఏమైనా సాయం చెయ్యగలనేమో చూస్తాను. అట్లా కాక చెడు దారినే ఉంటానంటే మటుకు, ఇన్‌స్పెక్టరుగా నా బాధ్యతను నేను నిర్వర్తించాల్సి ఉంటుందని మర్చిపోకు!" కఠినంగా చెప్పి, లేచి వెళ్ళిపోయాడు మహేశ్.

అతని మాటలు సతీష్‌ని ఆలోచింపజేశాయి. చదువు వల్ల, సత్ప్రవర్తనల వల్ల మహేష్‌కు అబ్బిన హుందాతనం అతనికి నచ్చింది. 'నేనూ మర్యాదస్తుడిని అవుతాను' అనిపించింది అతనికి. మనసు మారింది. తల్లిదండ్రులను ప్రాధేయపడి, వాళ్ళ సాయంతో తను కూడా నిజాయితీగా ఒక వ్యాపారం మొదలుపెట్టాడు. నిలకడమీద అందులో విజయం సాధించి, మర్యాదస్తుడు అనిపించుకున్నాడు!



# పంతాలు-పట్టింపులు

*పంతాలు, పట్టింపులు- ఇవన్నీ ఉండేది నిజానికి పెద్దవాళ్లకే కదా?! అవి లేకపోతే జీవితం చాలా గొప్పగా ఉంటుంది...*

*రచన: వల్లెం శ్రీకాంత్, ఆరవ తరగతి, ప్రాథమికోన్నత పాఠశాల, కంకణాల పల్లి, ప్రకాశం జిల్లా.*

కంకణాలపల్లిలో రవి, గణేష్ అనే పిల్లవాళ్లు ఉండేవారు. ఇద్దరిదీ ఒకే స్కూలు; ఇద్దరూ బాగా చదువుకునేవాళ్లు. వాళ్ల ఇళ్లు కూడా ప్రక్కప్రక్కనే ఉండేవి.

ఇద్దరూ మంచి స్నేహితులే కానీ, వాళ్ల తల్లిదండ్రుల మధ్య మాత్రం రకరకాల గొడవలు ఉండేవి. అయినా రవి, గణేషులు మాత్రం ఎవరు ఏమన్నా పట్టించుకునేవాళ్లు కాదు.

అయితే ఒక రోజున రవి బడికి రాలేదు. ఎందుకు రాలేదో మరి, ఎవ్వరికీ తెలియలేదు. సాధారణంగా రవి, గణేష్

ఇద్దరూ కలిసి వస్తుంటారు బడికి- ఆ రోజున మటుకు తను బయలుదేరేప్పుడు రవిని పిలవలేదు గణేష్, ఎందుకనో.

'మధ్యాహ్నం వస్తాడేమో' అని ఎదురు చూసాడు; అప్పటికీ రాకపోవటంతో సాయంత్రం స్కూలు వదిలిన తరువాత రవి వాళ్ల ఇంటికి వెళ్లాడు అతను.



అప్పుడు తెలిసింది- 'రవిని పాము కాటు వేసింది; ఆస్పత్రిలో ఉన్నాడు! ప్రమాదమేమీ లేదు. అదృష్టవశాత్తు అతన్ని కరిచింది విషపు పాము కాదు' అని.

వెంటనే ఆసుపత్రికి వెళ్ళి చూసి వస్తానని బయలు దేరాడు గణేష్. కానీ వాళ్ల ఇంట్లో వాళ్లు పోనివ్వలేదు- "పిల్లల్ని రానివ్వరు; పిల్లలు ఆస్పత్రికి పోకూడదు; ప్రమాదం ఏమీ లేదులే; పోవాలని ఏమున్నది"-ఇట్లా ఏవేవో చెప్పారు. దానితో ఇక చేసేదేమీ లేక గణేష్ అట్లానే ఉండిపోయాడు.

రెండు మూడు రోజుల తర్వాత రవి ఇంటికి వచ్చాడు. తర్వాతి రోజునుండి స్కూల్‌కి రావటం కూడా మొదలుపెట్టాడు. గణేష్‌కి అతన్ని చూడగానే ప్రాణం లేచివచ్చినట్లయింది- దగ్గరికి పోయి, పలకరించి, చూడటానికి రానందుకు క్షమాపణలు చెప్పాడు. 'దానిదేమున్నది, అయినా ఆస్పత్రికి పిల్లల్ని రానివ్వరు!' అన్నాడు రవి. గణేష్ దగ్గర నోట్సులు తీసుకొని, తను లేనప్పుడు జరిగిన పాఠాలన్నీ అతని చేతే చెప్పించుకున్నాడు.

ఆ తర్వాత కొన్ని రోజులకు గణేష్‌ని ఓ వీధి

కుక్క కరిచింది. డాక్టర్ దగ్గరికి వెళ్తే ఒక వారం విశ్రాంతి కావాలని చెప్పాడు. ఈ విషయం తెలిసి, అతని దగ్గరికి బయలు దేరాడు రవి. అయితే ఈసారి రవి వాళ్ల ఇంట్లోవాళ్ళు అడ్డు పడ్డారు- "ఏమున్నది, పర్వాలేదులే; బానే ఉంటాడులే, ఏమీ కాదు; అయినా నీకు బాలేనప్పుడు వాడు రాలేదు కదా, ఇప్పుడు నువ్వు ఎందుకెళ్ళాలి; వాళ్ల ఇంట్లో వాళ్ళు మంచోళ్ళు కాదు"- ఇట్లా రకరకాలుగా చెప్పసాగారు.

అయినా రవి పట్టించుకోలేదు. గణేష్ వాళ్ల ఇంటికి వెళ్ళి, అతన్ని పలకరించి, "ఏమీ పరవాలేదులేరా! నేను నీకు కావాల్సిన నోట్సులను అన్నీ ఎప్పటికప్పుడు అందజేస్తాను. నువ్వు ఇంట్లో ఉండే చదువుకుంటూండు" అని ధైర్యం చెప్పి వచ్చాడు.

ఊళ్ళలో సంగతులేవీ దాగవు కదా, ఆ రోజు సాయంత్రం కల్లా రవి వాళ్ల ఇంట్లో తెలిసింది: 'వాడు గణేష్ వాళ్ల ఇంటికి వెళ్ళాడు- తాము వెళ్ళద్దన్నా వెళ్ళాడు!' అని. దాంతో ఆ రోజు సాయంత్రం రవి బడినుండి ఇంటికి రాగానే ఇంట్లో వాళ్లంతా 'కయ్యి'మంటూ లేచారు. "నీకు మేమంటే లెక్కలేకుండా పోతున్నది. నువ్వు మమ్మల్ని అస్సలు పట్టించుకోవట్లేదు. మేం వెళ్లద్దన్నా వెళ్తున్నావు వాళ్ళ ఇంటికి!" అని గొడవ పెట్టారు.



అయితే అంతా చూస్తున్న తాత రవికి మద్దతుగా నిల్చాడు. ఇంట్లో వాళ్లకి

చెప్పాడు- "చూడండి, మీరు చేస్తున్నది పూర్తిగా తప్పు. 'ఇంతకు ముందు గణేష్ రాలేదు; కాబట్టి వాళ్ళింటికి వెళ్లకూడదు' అంటున్నారు మీరు. ఇప్పుడు వీడు పోలేదనుకో, ఆ తర్వాత వాళ్ల ఇంట్లో పెద్దలు వాడికి అడ్డు పడతారు. వీడు రాలేదని వాడిని పంపరు; వాడు రాలేదని వీడిని పంపరు. ఇట్లా పెద్దలు వేసుకునే మితిమీరిన లెక్కల వల్లనే పిల్లల మధ్య బంధాలు తెగిపోయేది! మీకు అర్థం అవుతున్నదో, లేదో- మానవ సంబంధాలన్నీ ఇట్లాగే చెడిపోతున్నాయి. 'వాడు చేస్తే మనం చేద్దాం, వాడు చేయకపోతే మనం చేయకూడదు' అని పిచ్చి నియమాలు పెట్టుకోవటం వల్ల అందరం నష్టపోతున్నాం. అసలు నన్నడిగితే 'వీళ్ళు చేసిన పని చాలా గొప్పది' అంటాను. మనం అందరమూ వాడి వెంట గణేష్ వాళ్ళింటికి వెళ్ళి పలకరించి రావాలంటాను. ఊరికే ద్వేషాలు పెంచుకోకూడదంటాను! మీరు రాకపోయినా నేనే వెళ్ళొస్తానంటాను!" అన్నాడు గట్టిగా.

తాత మాటలు అందరినీ ఆలోచింప జేసాయి. చీకటి పడేలోగా రవి వాళ్ల ఇంట్లోవాళ్లంతా గణేష్ వాళ్ళింటికి వెళ్ళి, వాడిని పరామర్శించి వచ్చారు.

అప్పటి నుండి వాళ్ల కుటుంబాలు రెండూ బాగా దగ్గరయ్యాయి! ఒకరి కష్ట సుఖాలలో మరొకరు పాలు పంచుకోవటం మొదలైంది!

NEFT TRANSFER కోసం:
“Kottapalli Prachuranalu”
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBHY0020902

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

జడ్జి: (ముద్దాయితో) ఈ నేరం నువ్వొక్కడివే చేసావా?
ముద్దాయి: అవునండీ, ఈ రోజుల్లో ఎవ్వరినీ నమ్మలేం!



# మూడు కోతుల కథలు

*కొత్తపల్లిలో వచ్చిన మూడు కోతుల బొమ్మ గుర్తుందా? ఇవిగో, పోరంకి వికాస విద్యావనంనుండి వచ్చిన* ***మూడు*** *కోతుల కథలు, ఒక* ***నాలుగు****.. వీటిలో మీకు ఏ కథ నచ్చిందో చెప్పండి?*



## బంక కథ



అనగనగా ఒక అడవిలో రాము, చింటూ, కిట్టూ అనే మూడు కోతులు ఉండేవి. అవి చాలా అల్లరివి. అడవిలో అంతటా తిరుగుతూ, ఇష్టం వచ్చినట్లు అడుకుంటూ, కనబడ్డ పండునల్లా తింటూ ఉండేవి ఎప్పుడూ.

చెట్లకు చాలా వాటికి బంక ఉంటుంది, కదా? ఒకరోజున ఈ మూడు కోతులూ అట్లా అడవిలో చెట్ల మీద ఆడుకుంటూ ఉంటే, వాటి చేతులకు ఆ బంక అంటుకుంది. దాంతో వాటికి చేతులు కట్టేసినట్లు అయ్యింది; ఒళ్ళంతా కంపరం మొదలైంది; మనసంతా 'కిచకిచ' మొదలైంది.

రాముకు కళ్ళు దురద పుట్టాయి. అది కళ్ళు నలుచుకునే సరికి, ఏముంది, చేతులు కాస్తా కళ్ళకు అతుక్కుపోయాయి! ఎంత పీక్కున్నా చేతులు విడిపోలేదు! దాంతో అది 'కుయ్ కుయ్' మని గట్టిగా అరవటం మొదలు పెట్టింది.

ఆ అరుపులు విని  చింటూకి భయం వేసింది. 'అరవకు! అరవకు! నాకు భయం వేస్తున్నది!'

అని తను కూడా గట్టిగా అరుస్తూ, చేతులకున్న బంక సంగతి మర్చిపోయి గట్టిగా చెవులు మూసుకున్నది. అంతే- దాని చేతులు కాస్తా చెవులకి అతుక్కుపోయాయి!

సరిగ్గా ఆ సమయానికి 'ఏయ్! చేతులు.. జాగ్రత్త..' అని అరవబోయింది కిట్టూ. దాని మాటలు గొంతులో ఉండగానే చింటూ చేతులు చెపులకు అతుక్కుపోయాయి! దాంతో 'అయ్యో, పాపం!' అనుకుంటూ తన చేతులతో నోరు మూసుకున్నది చింటూ. ఇంకేమున్నది, చేతులు కాస్తా దాని నోటికి అతుక్కుపోయాయి!

అట్లా చేతులు కట్టేసుకున్న మూడు కోతులూ వాటిని విడిపించుకుందామని ఎంత ప్రయత్నించినా పలితం లేకపోయింది.

ఆ రోజు సాయంత్రం గాంధీ గారు అటుగా పోతూ వాటిని చూసారు. సరిగ్గా ఆ సమయానికి అక్కడికి దగ్గర్లోనే ఒక నక్క, ఎలుగు బంటి చనిపోయిన జింకను తినడానికి గొడవ పడుతూ కనిపించాయి. ఆ సమయంలో గాంధీ గారికి మన మూడు కోతులనూ చూసి చాలా ముచ్చట వేసింది. "అరే! మన మానవుల కంటే ఇవి ఎంతో మంచివే! చెడు చూడటం లేదు; అవి తిట్టుకునే తిట్లు వినటంలేదు; వాటిని తిట్టి తమ మనసును పాడు చేసుకోకుండా ఎంచక్కా నోరు మూసుకున్నాయి! మనకు ఎంత చక్కని పాఠాన్ని నేర్పుతున్నాయో కదా!" అనుకున్నారు. అట్లా మనందరికీ 'చెడు వినకు, చెడు చూడకు , చెడు మాట్లాడకు' అని ఒక సూక్తి పెట్టారు.

ఇంతకీ మూడు కోతులకూ ఏమైంది, ఆ తర్వాత? అవి వాళ్ల అమ్మా వాళ్ల దగ్గరికి పోయినై. వాళ్ల అమ్మలు కొంచెం ఆలోచించి, వాటి చేత స్నానం చేయించాయి. స్నానంలో తేమకు వాటి చేతులు మళ్ళీ వాటి స్వాధీనంలోకి వచ్చేసినై!

*రచన- ఎ.సూర్యతేజ్, ఆరవ తరగతి.*

# తగిన శిక్ష

అనగనగా మూడు కోతులు. చెడు వినటం, చెడు మాట్లాడటం, చెడు చూడటం- ఇవే వాటి పనులు. ఇంకేమీ లేవు. అందుకని ఏ జంతువూ వాటిని పట్టించుకునేది కాదు.

ఒక రోజున వాటికో కుందేలు కనిపించింది.



చెడు మాట్లాడే కోతి దానిని ఆపి, 'నువ్వెందుకే, ఉండేది అడవిలో?! ఎందుకూ పనికిరావు నువ్వు!' అని హేళన చేసింది.

చెడు వినే కోతి అది విని, ఇంకా ఎగతాళిగా ఇకిలించింది. కుందేలు ముఖం చిన్నబోయింది.

చెడుని చూసే కోతి దాన్ని చూసి చప్పట్లు కొట్టింది. కుందేలు ఆ మూడింటికేసీ కోపంగా చూసి, ఏమనాలో చేతగాక, పొదలోకి దూరింది.

మూడు కోతులూ నవ్వుకుంటూ ముందుకు పోయినై. ఈసారి వాటికి ఒక ఏనుగు ఎదురైంది.

మూడు కోతులూ దాన్ని ఆపినై.

"ఏంటి సంగతి?" అన్నది ఏనుగు.

"నువ్వు ఎందుకురా, ఈ అడవిలో?! ఒట్టి గడ్డి దండగ. ఎందుకూ పనికి రావు. పైగా అంత బండగా ఉంటావు" అన్నది చెడు మాట్లాడే కోతి.

"అహ్హాహ్హాహ్హా! భలే అన్నావు!" అంటూ ఇకిలించింది చెడు వినే కోతి.

వాటిని చూసి ఏనుగు ముఖం ఎర్రబడింది.

"ఎంత మంచి దృశ్యం! చూస్తే దీన్నే చూడాలి! దీని ముఖం కందిరీగలకంటే ఎర్రగా ఉంది!" అన్నది చెడుని చూసే కోతి.

ఏనుగు ఒక్క దూకు దూకి, మూడుకోతులనీ తొండంతో చుట్టి పైకెత్తింది. గిరగిరా తిప్పింది. అప్పటివరకూ ఎగతాళిగా నవ్వుతూన్న కోతులు మూడూ ఇప్పుడు భయంతో హాహాకారాలు చేసాయి.

అంతలోనే అక్కడికొచ్చిన కుందేలు ఏనుగును ఆపి- "ఏనుగు మామా! వీటికి శిక్ష వేయాల్సింది నువ్వు కాదు- సింహరాజు దగ్గరికి తీసుకుపోదాం. తప్పు చేసినవాళ్ళను శిక్షించే అధికారం రాజుగారికి ఒక్కరికే ఉంది" అంది.

ఏనుగు ఒక్క క్షణం ఆలోచించింది. మూడు కోతులనూ కట్టగట్టి రాజుగారి దగ్గరకు ఈడ్చుకెళ్ళింది. జరిగిందంతా చెప్పింది. రాజుగారు మూడు కోతులకూ ***తగిన*** శిక్ష వేసాడు: చెడు మాట్లాడే కోతి వారం రోజులపాటు నోటిమీద చేతులు వేసుకొని కూర్చోవాలి. చెడు వినే కోతి అన్ని రోజులపాటూ చెవులు మూసుకొనే ఉండాలి. చెడు చూసే కోతి వారం రోజులపాటు చేతుల్తోటి కళ్ళు మూసుకొనే ఉండాలి.

వారం రోజుల్లో కోతులు మూడూ మంచివైపోయాయి! ఇంక అప్పటి నుంచి చాలా బుద్ధిగా ఉండటం మొదలు పెట్టాయి.

*రచన-రోహన్, ఆరవ తరగతి.*

భక్తుడు: మీ ఆశీర్వాదంతో నా కోరిక తీరింది స్వామీ! మాట ప్రకారం వంద కొబ్బరి కాయలు మీ ముందే పగలగొట్టేస్తా!



స్వామీజీ: భక్తా! పగలగొట్టొద్దు, నాకే సమర్పించుకో! కొబ్బరి కాయల రేట్లు పెరుగుతున్నాయి!

# చెడుని వినాలి, చూడాలి, పోరాడాలి!

ఒక అడవిలో మూడు కోతులు ఉండేవి. మూడు కోతులూ ఒకసారి 'చెడు వినకూడదు; చెడు మాట్లాడకూడదు; చెడు చూడకూడదు' అని నిర్ణయించుకున్నాయి.

సరిగ్గా ఆ సమయానికి ప్రక్క కొమ్మ మీద గూడు కట్టుకొని ఉన్న కోకిలమ్మ తన పిల్లలను గూటిలోనే వదిలి, మేతకోసం బయటికి వెళ్ళింది. అది అటు వెళ్ళగానే పరదేశం నుండి వచ్చిన గద్ద ఒకటి ఆ పిల్లల్ని ఎత్తుకు పోయేందుకు వచ్చి వాలింది.



"ఓ! చెడు! చెడు! నేను దీన్ని చూడలేను!" అని ఒక కోతి కళ్ళు మూసుకున్నది.

"ఉం.. ఉం... బెబు!! బెబు!" అంటూ నోరు మూసుకున్నది మరొక కోతి.

"నేను ఈ అరుపులు వినలేను! వినలేను!" అంటూ చెవులు మూసుకున్నది మూడో కోతి.

సంతోష పడిన గద్ద కోకిల పిల్లలకు ఇంకా దగ్గరికి వచ్చింది. కోకిల పిల్లలు ప్రాణ భయంతో అరవటం మొదలెట్టాయి.

అంతలో మూడు కోతులకూ చాలా సిగ్గు వేసింది. "అసలు మంచి అంటే ఏమిటి?! చెడు అంటే ఏమిటి?! ఇతర జంతువులకూ, పక్షులకూ, కీటకాలకూ అబద్ధాలు చెప్పడం చెడు. అట్లాగే తోటి పక్షులను, జంతువులను ఆపదల్లోకి నెట్టటం చెడు. అసలు అక్రమాలను చూడకుండా, వాటిని గురించి వినకుండా, వాటిని గురించి మాట్లాడకుండా ఉండకూడదు! చెడును అర్థం చేసుకొని, ఎన్ని కష్టాలెదురైనా సరే, పోరాడి చెడును అరికట్టాలి! మనం

'చెడును వినకూడదు,చెడు మాట్లాడ కూడదు, చెడును చూడకూడదు' అనుకోవడం అసలు సరైనది కాదు! పోరాటమే మేలు!" అనుకున్నాయి.

చటుక్కున కోకిల పిల్లలను అవి ఉండే గూటితో సహా- తీసుకెళ్ళి చెట్టు తొర్రలో పెట్టి, తొర్రకు అడ్డంగా నిలబడ్డాయి. బెదిరించబోయిన గద్దను మూడూ కలిసి తరిమేసాయి. కోకిల పిల్లల్ని కాపాడాయి.

*రచన- అక్షర, ఐదవ తరగతి*

## మారిన కోతులు



అనగనగా మూడు కోతులు ఉండేవి. అవి ఎప్పుడూ చెడ్డ పనులే చేసేవి. రోడ్డు మీద వెళ్ళే వాళ్ళ మీద రాళ్ళు వేసేవి; అరటి తొక్కలు విసిరేవి; పిల్లల చేతుల్లోంచి పదార్థాలన్నీ ఎత్తుకుపోయేవి; వాళ్లని కొరికేవి; ఇళ్ళలోంచి గిన్నెలు, చెంచాలు ఎత్తుకెళ్ళేవి- ఎప్పుడూ ఏదో ఒక తుంటరి పని చేస్తూనే ఉండేవి.

మిగిలిన కోతులు వాటికి నచ్చ జెప్పేందుకు ప్రయత్నించినై. "మీ మూలంగా కోతులన్నిటికీ చెడ్డ పేరు వస్తున్నది" అని చెప్పినై. అయినా అవి పట్టించుకోలేదు. తమ దారిన తాము అల్లరి చేస్తూ 'రౌడీ కోతులు' అని పేరు తెచ్చుకున్నై.

అకస్మాత్తుగా ఒక రోజున "జూ" నుండి కోతుల్ని పట్టుకునేవాళ్ళు వచ్చారు. వలలు వేసారు.

తాళ్ళు వేసారు. కనిపించిన కోతినల్లా వ్యాన్ ఎక్కించి తీసుకెళ్ళారు. 'వాళ్ళ నుండి తప్పించుకుందాం' అని రకరకాల ప్రయత్నాలు చేసాయి మన మూడు కోతులూనూ. ఒక్క ప్రయత్నం కూడా ఫలించలేదు సరికదా, 'ఇవే, దొంగ కోతులు!' అని జూలో పని చేసేవాళ్ళు వాటిని గుర్తించారు. వాటిని మూడింటినీ వేరుగా ఉంచి, తిండి పెట్టకుండా మాడ్చి, రకరకాలుగా సతాయించారు. అయినా అవి వాళ్లకు ఏమాత్రం లొంగలేదు.

చివరికి ఒకరోజున ఓ సర్కస్ వాళ్ళు వచ్చారు. 'మా సర్కస్‌లో పని చేసేందుకు కొన్ని కోతులు ఇవ్వండి' అని జూ వాళ్లను అడిగారు. జూ వాళ్ళకి వాళ్లంటే ఇష్టం లేదు; కానీ వాళ్ళు మన మూడు కోతులతోటీ బాగా విసిగిపోయి ఉన్నారు. ఎట్లాగైనా వాటికి బుద్ధి రావాలని, ఆ మూడు కోతుల్నీ సర్కస్ వాళ్లకి అమ్మేసారు.

మూడు కోతులూ చాలా సంతోషపడ్డాయి. స్వేచ్ఛ దొరికినట్లే ననుకున్నాయి. కానీ వాటికి తెలీదు- సర్కస్‌లో పని చేయటం అంటే నరకమేనని. సర్కస్ వాళ్ళు వాటికి అన్నం పెట్టకుండా మాడ్చారు. కొరడాతో కొట్టి తాము చెప్పిన పనల్లా చేసేట్లు వాటి చేత సాధన చేయించారు. అవి తప్పించుకునేందుకు ప్రయత్నించిన ప్రతిసారీ మరిన్ని శిక్షలు వేసారు.

కొన్ని వారాలు గడిచే సరికి కోతులు మూడింటికీ బుద్ధి వచ్చింది. "ఊళ్ళో అల్లరి చేయకుండా ఉండి ఉంటే హాయిగా ఉందుము కదా! మన అల్లరి వల్ల మనకి మనం కష్టాలు తెచ్చుకున్నాం; మిగిలిన కోతులకీ కష్టం తెచ్చి పెట్టాం!" అని చాలా బాధ పడ్డాయి.

చివరికి ఒకరోజున అవకాశం చూసుకొని మూడూ పారిపోయి, మెల్లగా ఊరు చేరుకున్నాయి. ఇప్పుడవి మంచి కోతులైపోయాయి. అల్లరి అస్సలు చేయలేదు. చెడు చెయ్యద్దు, చెడువినద్దు, చెడు మాట్లాడద్దు'ని సంపూర్ణంగా అమలులో పెట్టాయి!

*రచన-యువ సాయి తేజ, ఐదవ తరగతి.*



# రామయ్య మంచితనం

*రచన: ఎ గౌతమి, ఎనిమిదవ తరగతి, జడ్.పి.హెచ్.యస్. కోగిర, రొద్దం మండలం అనంతపురం జిల్లా.*

అనగనగా రామాపురంలో రామయ్య, సోమయ్య అనే రైతులు ఇద్దరు ఉండేవాళ్ళు. వాళ్లలో రామయ్య అమాయకుడు; సోమయ్య స్వార్థపరుడు.

ఒక ఏడాది రామయ్య సోమయ్యలు ఇద్దరూ వడ్లు పండించారు. రామయ్య పంట బాగా పండింది. సోమయ్య పంట పండలేదు. దాంతో సోమయ్య ఓర్వలేకపోయాడు. 'ఎట్లాగైనా సరే, రామయ్య పంటను నాశనం చెయ్యాలి" అని

ఆలోచించాడు.



"ఏముంది, బాగా ఎండి కోతలకు సిద్ధంగా ఉన్న పంటకు నిప్పు పెడితే సరి!" అనుకున్నాడు. అందుకు కావలసిన సామాన్లన్నీ తీసుకొని ఆ రోజు రాత్రి చీకట్లో బయలుదేరాడు. కానీ తానొకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తుందట! దారి మధ్యలోనే అతన్ని ఒక తేలు కుట్టింది! బాధతో విలవిలలాడి పోతున్న సోమయ్యకు రామయ్యే ప్రథమ చికిత్స చేసాడు!



"నువ్వు ఇంటికి పోయి పడుకోరా, నీ పొలానికి కూడా నేనే కాపలా కాస్తాను" అని అతన్ని ఇంటికి పంపించాడు కూడా!

ఐనా సోమయ్యకు రామయ్య పట్ల ఇష్టం ఏర్పడలేదు. "పంటను వేరే విధంగా సొంతం చేసుకుంటాను- అసలు ఈ రామయ్యను చంపేస్తే పొలం, పంట అంతా కూడా నాదే అవుతుంది కదా" అని

లెక్కలు వేసుకున్నాడు. ఆ రోజు మధ్యాహ్నం రామయ్య పొలానికి వెళ్ళాడు. ఆ సమయానికి రామయ్య అక్కడ లేడు. తన అన్నపు మూటని అక్కడే ఒక ప్రక్కగా పెట్టుకున్న సోమయ్య, తను తెచ్చిన విషాన్ని రహస్యంగా రామయ్య అన్నపు మూటలో కలిపేసాడు. ఆపైన 'నేను ఇక్కడే ఉంటే అనుమానం వస్తుంది' అని తను దూరంగా వెళ్ళాడు.



అయితే ఆ రోజున రామయ్యకు అస్సలు ఆకలిగా లేదు. 'తరువాత తింటాను. అన్నం మూటని తీసుకొని వెళ్తే దారిలో ఎక్కడైనా తినచ్చు' అనుకుంటూ పరధ్యానంగా సోమయ్య తన కోసం పెట్టుకున్న మూటని పట్టుకొని ఊళ్ళోకి వెళ్లాడు రామయ్య.

అయితే ఆ సంగతి సోమయ్యకు తెలీదు కదా; కొద్ది సేపటి తర్వాత వచ్చి చూసిన సోమయ్యకు తన మూట బదులు రామయ్య మూట దొరికింది. దాన్ని చూసి 'అది తను తెచ్చుకున్న అన్నమే' అనుకున్నాడతను! దాన్ని తానే తిన్నాడు!

కొద్ది సేపటికి వెనక్కి తిరిగి వచ్చిన రామయ్య విషపుటాహారాన్ని తిని పడిపోయిన

సోమయ్యను చూసి, కంగారు పడ్డాడు.



గబగబా అతన్ని తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్పించాడు. అతను ఆస్పత్రిలో ఉన్నన్ని రోజులూ తనూ అక్కడే ఉండి సోమయ్యని కంటికి రెప్పలా చూసుకున్నాడు.

అతని మంచితనం సోమయ్య కళ్ళు తెరిపించింది. తన తప్పును గ్రహించి, మనస్ఫూర్తిగా పశ్చాత్తాప పడ్డాడతను.

ఆ తర్వాత అతనిలో ఇక ఎన్నడూ రామయ్య పట్ల అసూయ కలగలేదు. ఇద్దరూ కలిసిమెలిసి సంతోషంగా జీవనం సాగించారు.

స్వాగతం!

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు.

పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !



# సమానత్వం

*సేకరణ: ఎ. శిల్ప, పదవతరగతి, కెజిబివి ఝురా సంఘం. జహీరాబాద్*

ఆనందపురం నగరాలకు చాలా దూరంగా ఉండే ఒక కుగ్రామం. అక్కడి ప్రజలు ఎక్కువ శాతం మంది రైతులు. కులమత భేదాలు లేకుండా అందరూ చక్కగా కలసి మెలసి జీవించేవాళ్ళు. ఒకరి కొకరు సహాయం చేసుకునేవాళ్ళు.

అయితే కొన్నేళ్ల క్రితం గోవిందయ్య అనే వడ్డీ వ్యాపారి ఒకడు ఆ ఊరికి వచ్చి స్థిరపడ్డాడు. రైతులకు వడ్డీలకు డబ్బులు అప్పివ్వటం మొదలు పెట్టాడు. రైతులందరూ మంచివాళ్ళు, నిజాయితీ పరులు కాబట్టి, ఒక్కరు కూడా అతనికి ఇవ్వాల్సిన డబ్బులు

ఎగగొట్టలేదు. దాంతో తక్కువ కాలంలోనే గోవిందయ్య పెద్ద ధనవంతుడు అయ్యాడు.



'డబ్బు అహంకారానికి హేతువు' అని చెబుతారు. రాను రాను గోవిందయ్యలో అహంకారం వేళ్ళూనుకున్నది. 'ఊళ్ళో జనాలంతా తన దయా దాక్షిణ్యాల వల్లే బ్రతుకుతున్నారు' అనుకోవటం మొదలుపెట్టాడతను.

పనివాళ్ళని, పాలవాళ్ళని, వృత్తికారుల్ని అందరినీ చులకనగా చూడటం మొదలుపెట్టాడు. ప్రతివారితోటీ అహంకారంగా మాట్లాడసాగాడు. దొరికిన వాళ్ళనల్లా రాచి రంపాన పెడుతున్నాడిప్పుడు.

దాంతో ఊళ్ళో ప్రజలందరికీ సహనం నశించింది. ఒక సందర్భంలో అందరూ కలిసి చర్చించుకున్నారు. 'గోవిందయ్యకు సరైన బుద్ధి చెప్పాల్సిందే' అనుకున్నారు.

మరుసటి రోజున గోవిందయ్య ఇంటికి పాలు పోసే వ్యక్తి 'పాలు లేవు అయ్యా!' అని మర్యాదగా చెప్పి, పాలు పోయటం ఆపేశాడు. గోవిందయ్య ఇంట్లో పనిచేసే మల్లన్న ఆరోగ్యం బాగా లేదని పని మానేశాడు. కిరాణ దుకాణపు రంగస్వామి 'ఇంటి పరిస్థితి బాలేదు గోవిందయ్యా! దుకాణం మూసేద్దామనుకుంటున్నాము' అని చెప్పి, గోవిందయ్యకు సరుకులు ఇవ్వలేదు. చాకలి మోహనయ్య "చేతులు నొస్తున్నాయి సేటూ" అని పని మానుకున్నాడు. అన్నిటినీ మించి,

ఇప్పుడెవ్వరూ 'నాకు అప్పివ్వు' అని రావట్లేదు గోవిందయ్య దగ్గరికి!



అయినా కొన్నాళ్ళు పడుతూ లేస్తూ పని నడిపించిన గోవిందయ్య చివరికి ఒక రోజున దిగాలుగా ఇంటి అరుగుమీద కూర్చున్నాడు. అటుగా వెళ్తున్న ఊరివాడు అతనిని పలకరించి "ఏమైంది సేటూ, నీరసంగా కనిపిస్తున్నావు" అన్నాడు. లేకలేక దొరికిన ఊరతనితో "నా వల్ల కావట్లేదు. పరిస్థితి ఇట్లాగే ఉంటే నేను పట్నానికి వెళ్ళిపోవాల్సి వచ్చేట్లుంది" అంటూ తన గోడంతా వెళ్లబోసుకున్నాడు గోవిందయ్య.

అతను నవ్వి, గోవిందయ్యను ఊరి పెద్దల దగ్గరికి తీసుకెళ్ళాడు. "ఊళ్ళోవాళ్లం అందరమూ కలిసి, కావాలనే ఇట్లా చేశాం గోవిందయ్యా, నువ్వు ఇప్పటికైనా మనుషుల విలువ తెలుసుకుంటావని!" అని చెప్పి మందలించారు ఊళ్ళోవాళ్ళు.

అన్ని కష్టాలు పడటం వల్ల గోవిందయ్యకు వెంటనే అర్థమైంది: 'తన వల్ల ఊరి ప్రజలు బ్రతకడం లేదు- వాళ్ల సహకారం వల్లే తన జీవనం గడుస్తోంది! ఊళ్ళో ఒకరి కొకరు సాయం చేసుకుంటేనే జీవితం!' అని.

'మనుషులంతా సమానమే! కలిసి జీవించటంలో సార్థకత ఉంది" అని తెలుసుకున్న గోవిందయ్య ఆ తర్వాత అందర్నీ గౌరవించడం మొదలు పెట్టాడు.

కారు ఓనర్: స్పీడ్ తగ్గించవయ్యా బాబూ! 3 కీ.మీ దూరంలో ప్రమాదం పొంచి వుందట!
డ్రైవర్: బ్రేకు ఫెయిలైందండీ...! ఏదైనా అడ్డొచ్చి గుద్దుకుంటే ప్రమాదం తప్పుతుంది! లేదంటే డైరక్టుగా వెళ్ళొచ్చు...!





# తమ్ముడు మొక్క

రచన: వి.సంహిత, నాలుగవ తరగతి, శ్రీ కృష్ణ ఇంగ్లీషు మీడియం హైస్కూలు, అనంతపురం.

ఆ రోజు రాజు పుట్టిన రోజు- బడిలో అందరికీ చాక్లెట్లు పంచాడు రాజు.

ఆ రోజు సాయంత్రం బడి నుండి ఇంటికి వస్తుంటే అతనికి ఒక పనసపళ్ళ బండి కనిపించింది.

దాన్ని చూడగానే అతనికి గుర్తుకొచ్చింది: వాళ్ళ అమ్మానాన్నలకు ఇద్దరికీ పనసపళ్ళంటే చాలా ఇష్టం.

అందుకని రాజు తన దగ్గరున్న పది రూపాయలతోనూ పనసపండ్లను కొని ఇంటికి తీసుకెళ్ళాడు. పనసపళ్ళు బహుమతిగా తెచ్చిన కొడుకును చూసి వాళ్ల అమ్మా నాన్న చాలా సంతోషపడ్డారు. పనస పళ్ళు తిని, విత్తనాలు పారేస్తుండగా రాజు వాళ్లని ఆపాడు-

"నాన్నా! ఈ విత్తనాలను పారెయ్యకండి. నేను వాటిని విత్తుతాను! కొన్నేళ్ల తర్వాత పనసపళ్ళు ఎంచక్కా మనింట్లోనే కాస్తై!"

అన్నాడు.

రాజు వాళ్ల అమ్మ-నాన్న ఇద్దరూ మురిసిపోయారు. "వీడు పెద్దవాడ-య్యాడు!" అన్నది అమ్మ. "చక్కగా ఆలోచిస్తున్నాడు. ఎంత ముందుచూపో చూడు!" అన్నాడు నాన్న.



రాజు ఆ విత్తనాలు విత్తుతుంటే వాళ్ళ నాన్న వచ్చి, దగ్గర నిలబడి చూసి, ఫోటో తీశాడు.

ఆ రోజంతా వాళ్ళు దాని గురించి మాట్లాడుకున్నారు. అయితే రాత్రి నిద్రపోయి లేచేసరికి, ఇంక ఆ విషయం గురించి మరచిపోయాడు రాజు. అమ్మ-నాన్న కూడా మళ్ళీ దాని ఊసు ఎత్తలేదు.

పది రోజుల తర్వాత, రాజు ఓ చిన్న మొలకను చూశాడు. అది తను నాటిన విత్తనానిదే; కానీ ఆ సంగతి అతనికి గుర్తు రాలేదు. 'ఏదో పిచ్చి మొక్క' అనుకున్నాడు.

అయితే రాజు ఆ మొక్కవైపే చూడటాన్ని వాళ్ళ నాన్న గమనించాడు: "ఒరేయ్! అది నువ్వు నాటిన పనస విత్తనందేరా, పనస మొలక అది!" అన్నాడు నవ్వుతూ. ఆ రోజు తీసిన ఫొటో కూడా చూపించాడు.

రాజుకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

"విత్తనం నాటడమే కాదు, అది పెరిగి చెట్టు అయేంతవరకూ జాగ్రత్తగా కాపాడాలి- చిన్న మొలక కదా! అది నీ కవల తమ్ముడి లాంటిది! గుర్తున్నదిగా, దాని పుట్టిన రోజు, నీ పుట్టిన రోజు ఒకటే!" అన్నాడు నాన్న.

ఇక ఆ తర్వాత తన తమ్ముడు మొక్కను మరిచిపోకుండా చాలా జాగ్రత్తగా చూసుకున్నాడు రాజు.



# నేతగాడు-భూతం

*రచన: నారాయణ, కొత్తపల్లి బృందం.*

అనగా అనగా ఒక ఊళ్ళో బట్టలు నేసే రామయ్య ఒకడు ఉండేవాడు. అతని భార్య సీతమ్మ దూదేకులు తీసుకొచ్చి, రాట్నం మీద వడికి, దారంతీసి, కండెలు చుట్టేది. అతను ఆ కండెలకు రంగులద్ది, వాటిని సరిచేసుకొని, గుంట మగ్గం మీద బట్టలు నేసేవాడు. మగ్గం నడిచినప్పుడు ఏ దారాలు పైకి రావాలో, ఏవి క్రిందికి పోవాలో తెలిపే డిజైన్ అట్టల్ని కూడా భార్య సహాయంతో రామయ్యే తయారు చేసుకునేవాడు. అట్లా ఇద్దరూ శ్రమపడి తయారు చేసిన బట్టని పట్నంలో దుకాణాల వాళ్ళకు అమ్మి, ఆ వారానికి కావలసిన సరుకులు కొనుక్కొచ్చుకునేవాళ్ళు.

ఒకసారి అట్లా పట్నం వెళ్ళిన రామయ్య, రోజంతా ఎండలో తిరిగీ తిరిగీ చాలా అలసిపోయాడు.



'పట్నపు నీళ్ళు తన ఒంటికి పడవు' అని అతను పల్లెనుండి తెచ్చుకున్న నీళ్లన్నీ ఐపోయాయి- దాహంతో నోరు పిడచ గట్టుకు పోయింది. చివరికి ఊరికి బయలుదేరే సరికి అతని ప్రాణాలు కడబట్టినట్లయినై. రోడ్డుకు ఓ ప్రక్కగా కళ్ళు తిరిగి పడిపోయాడు.

కళ్ళు తెరిచి చూసేసరికి అతను ఒక గుహలో ఉన్నాడు- చిన్న భూతం ఒకటి, అతని ముఖంలో ముఖం పెట్టి చూస్తున్నది!

రామయ్య గట్టిగా కేకలు పెడదామనుకున్నాడు గానీ, అతని నోరు తెరుచుకోలేదు; గొంతు పెగల్లేదు; కనీసం మూలుగు కూడా బయటికి రాలేదు. అయితే భూతం పిల్ల మటుకు "తెరిచాడు! కళ్ళు తెరిచాడు!!" అని కేకలు పెట్టి అవతలికి ఒక్క గెంతు గెంతింది.

"ఒరోరి! వీడెవడో గట్టి పిండంలాగున్నాడు! చచ్చాడనుకొంటి! నువ్వేం చెప్పకు- నువ్వేం చెప్పకు!" అని మరో గొంతు వినిపించింది గుహ బయటినుండి.

రామయ్య లేచి కూర్చొనే సరికి పెద్ద భూతం ఒకటి లోపలికి వస్తున్నది. అంతకు ముందు తను చూసిన పిల్ల భూతం దాని తోకను పట్టుకొని అడుగులో అడుగు వేస్తున్నది.

"నేను ఇక్కడికెలా వచ్చాను? ఇంతకీ మీరెవరు?" అరిచాడు రామయ్య.

"కనిపించట్లేదూ?! భూతాలం!" అన్నది తల్లి భూతం, కళ్ళు పెద్దవి చేసి, తన గార పళ్ళు

కనబడేట్లు ఇకిలించి.

"ఓహో! మీరు భూతాలా?! ఎవరో పగటి వేషగాళ్ళు అనుకున్నాను" అన్నాడు రామయ్య, "ఎలా తప్పించుకోవాలా?" అని ఆలోచిస్తూ.

"కాదు- నిజం భూతాలమే! కావాలంటే ముట్టి చూడు!" అని చేతులు ముందుకు చాచింది భూతం.

రామయ్య దాని చేతులు ముట్టి చూశాడుగానీ, అంతకు ముందెన్నడూ భూతం చేతులు ఎలా ఉంటాయో చూడలేదు కద, అందుకని అతనికి ప్రత్యేకంగా ఏమీ తెలియనైతే తెలీలేదు.

అయినా అతను మర్యాదగా తల ఊపుతూ "అవును- అవును- తెలుస్తూనే ఉంది" అని సణిగాడు.

"అయినా నువ్వు చచ్చావనుకొంటిమే! అందుకనే వీళ్ల నాయన్ని పంపించాను నేను!" అని నాలుక కరచుకున్నది భూతం.

"చేప్పేసావ్! చెప్పేసావ్! ఇప్పుడెలాగ?" అని ఎగిరింది భూతం పిల్ల.

"ఎక్కడికి పంపారు? ఎందుకు పంపారు?" అని ఒక్క ఉదుటున లేచి కూర్చున్నాడు రామయ్య. భూతం పిల్ల "కెవ్వు"మని అరిచి, ఒక్క గంతులో వాళ్ళ అమ్మ వెనక్కి చేరుకున్నది.

"నీ వేషం వేసుకొని, మీ ఊరెళ్ళాడు, వీళ్ళ నాయన. మీ ఊళ్ళో బాగా బలిసిన పశువులూ, గొర్రెలూ, మనుషులూ ఉంటారు కదా, వెళ్ళి వీలైనంతమందిని ఒకేసారి ఎత్తుకొచ్చేస్తే, తర్వాత ఓ ఏడాది పాటు మేం హాయిగా వాటినే తింటూండచ్చు కదా- అందుకని!" మురిసిపోతూ గొప్పగా చెప్పింది భూతం.

"ఎవరు చెప్పారు? మా ఊళ్ళో మూడేళ్ళుగా వానల్లేవు. పశువుల కొట్టాలన్నీ ఖాళీ. గొర్రెల మంద ఒక్కటి కనిపిస్తే ఒట్టు. అయినా నన్నడిగితే నేనే చెప్పేవాణ్ణిగా, అంత దూరం ఎందుకు వెళ్ళాడు ఊరికే?!" చికాకు పడ్డాడు రామయ్య.

"ఎందుకెళ్ళాడో, ఏంటో-" అని కలవర పడింది భూతం- "వెళ్ళాక నాలుగురోజులైనా ఒక్క ఫోనూ లేదు! ఎట్లా ఉన్నాడో, ఏంటో తెలీనే లేదు!"

"ఓహో! మీకు ఫోను కూడా ఉందా? ఏ నెట్వర్క్?" అనుకున్నాడు రామయ్య. అయినా అది భూతానికి ఎలా తెల్సిందో తెల్సింది-

"మా ఫోన్లు మీ ఫోన్ల లాగా కాదు- ప్రాణం ఉన్న మనిషి మెదడులోంచి మా మెదడుకు పోతై- అంటూనే భూతం గబుక్కున వచ్చి రామయ్య నెత్తి మీద ఓ కట్టెతో గట్టిగా మొత్తింది.

చటుక్కున రామయ్య మెదడులో ఓ ఫోను మోగుతున్నట్లు అనిపించసాగింది. స్పీకరుకు తగిలించినట్లు ఆ శబ్దం గుహ అంతటా ప్రతిధ్వనించ సాగింది- "క్రం..క్రం.. క్రంక్రం... క్రంక్రం.."

అంతలో అకస్మాత్తుగా "అబ్బా!.. నా ప్రాణాలు పోతున్నాయే! వీడు మామూలోడు కాదు! నా బ్రతుకింత ఘోరం అయిపోతుందని ఏనాడూ అనుకోలేదు.. అయ్యో!... అబ్బా!...కుయ్యో!" అని మూలుగులు వినిపించసాగాయి.

"ఓరోరిరిరిరిరి.. నీకేమైందిరో.." అని రామయ్య దగ్గరికొచ్చి మొత్తుకున్నది భూతం.

"మళ్ళీ చెబుతా! ఇప్పుడు శక్తి లేదు! తొందరగా మన గుహలోంచి మంత్రపు నీళ్ళు కొన్ని పంపియ్యి నాకు! వాడి చేతికి ఇచ్చి పంపియ్యి పర్లేదు. వాడికి ఓ కిలో బంగారమూ, పదో పన్నెండో వజ్రాలూ కూడా మూటగట్టి ఇచ్చి పంపించు! పాపం! అయ్యో..!" అని వినిపించింది అవతలినుండి.

భూతం, పిల్ల భూతం రెండూ గొల్లున ఏడుపులంకించుకున్నాయి.

"అబ్బ! ముందు ఏమైందో చెప్పి, ఆ తర్వాత ఏడవండి!" మొత్తుకున్నాడు రామయ్య. జవాబుగా ఇంకా గట్టిగా ఏడ్చింది పిల్ల

భూతం.

తల్లి భూతం వణుక్కుంటూ రామయ్యతో "ఇదిగో అబ్బీ! ముందు బయల్దేరు! తొందరగా పో, మీ ఇంటికి! అక్కడ మా ఆయనుంటాడు- అయితే పాపం, నీకంటే చాలా నీరసంగా ఉంటాడేమో- ఆయనకి ఈ మంత్రపు నీళ్ళ చెంబు అందించు. ఈ బంగారమూ, వజ్రాలూ నీకు- తీసుకొని ఇక్కడున్నట్టే ఇల్లు చేరుకో- పో!" అని చేతికి ఓ చిన్న మూటనిచ్చి, రామయ్యను బయటికినెట్టేసింది.

రామయ్యకు ఏమీ అర్థం కాలేదు- అయినా "ప్రాణాలు దక్కిందే చాలు" అనుకొని పరుగు పరుగున ఇల్లు చేరుకున్నాడు.

అల్లంత దూరాన ఉండగానే అతని భార్య అతన్ని ఎదుర్కొని, "మంచంలోంచి లేవొద్దన్నానా?! పోయి పడుకో, పో!" అంటూ ఇంట్లోకి లాక్కెళ్ళి, బయటినుండి గొళ్లెం పెట్టేసింది.

లోపల మంచం మీద పడుకొని ఉన్నాడు రామయ్య!! -వాడిని చూసి రామయ్య ఒక్క క్షణం బెదిరిపోయాడు గానీ, వెంటనే తేరుకున్నాడు. అప్పుడు అర్థం అయ్యింది అతనికి: "ఇక్కడున్నది భూతం! తన వేషంలో వచ్చింది! తమ ఊళ్ళోంచి పశువుల్నీ, గొర్రెల్నీ, మనుషుల్నీ ఎత్తుకెళ్ళేందుకు వచ్చింది! తను లేకున్నా, ఇంట్లో వాళ్ళెవరికీ తను లేనట్టే తెలీలేదు!"



ఆ ఊహ రాగానే అతనికి రక్తం మరిగినట్లయింది. ఆ భూతాన్ని పచ్చడి పచ్చడి చేయాలనిపించింది. అయితే

భూతం వాడు ఎలాంటి దశలో ఉన్నాడంటే, వాడికి అసలు ప్రాణాలు ఉన్నాయో, లేవో కూడా తెలీలేదు రామయ్యకు. అతను వెళ్ళి వాడి ముక్కు దగ్గర చెయ్యి పెట్టి, గాలి ఆడుతున్నదో లేదో చూశాడు. అంతలోనే వాడు నోరు తెరిచి, నీరసంగా "నీ..ళ్ళు" అని గొణిగాడు.



రామయ్యకు ఆ భూతం వాడి పరిస్థితి చూసి జాలివేసింది. అంతలోనే వాడి భార్య ఇచ్చిన మంత్రపు నీళ్ళ చెంబు గుర్తొచ్చి, దాన్ని తీసి నీళ్ళన్నీ భూతంవాడి నోట్లో వొంపేసాడు.

నీళ్ళు నోట్లో పడగానే భూతంవాడు కళ్ళు తెరిచి, నీరసంగానే లేచి కూర్చున్నాడు. వణికే గొంతుతోటే మాట్లాడటం మొదలెట్టాడు వాడు:

"ఒరే! మీరంతా బలే మంచోళ్ళురా! కష్టాలంటే మాకే అనుకున్నాను- మీకున్న కష్టాలు ఎవ్వరికీ ఉండవని ఇప్పుడర్థం అయ్యిందిరా! మీ ఊళ్ళో బక్కగాలేని పశువులు లేవు, ముదిరిపోని గొర్రెలు లేవు- చివరికి మీ ఊరి మనుషులెవ్వరికీ మేం తినేందుకు సరిపడ మాంసం కూడా లేదు- అయినా అందరూ బ్రతికి ఎలా ఉంటున్నారా, ఇక్కడ?

ఏదో, నాలుగు రోజులు హాయిగా ఉండచ్చు అనుకొని ఇక్కడికి వచ్చానుగానీ, మీరు తినే ఎండు కారమూ, జొన్న అంబలీ రెండ్రోజులు తినేసరికి నా బ్రతుకు ఇట్లా అయిపోయింది. అది తిని, అన్ని గంటలు నేయాలట్రా?

చీకటి గుంతల్లో కూర్చొని అన్నేసి గంటలు ఎట్లా పని చేస్తుంటార్రా, మీరు?! ఇదిగో,

జాగ్రత్తగా విను- నువ్వు మంచోడివి గనక, నీకో ఆఫర్ ఇస్తా- నువ్వు కూడా భూతం అయిపోయి, నాతో వచ్చేయ్- నిజం, భూతాల జీవితం మీ జీవితం కంటే వందరెట్లు బాగుంటుంది- నా బిడ్డ మీద ఒట్టు!" అని ఏదేదో వదిరాడు వాడు.



రామయ్య వాడికేసి జాలిగా చూస్తూ నిలబడ్డాడు. "వీడికి ఏదో తిక్క పట్టింది" అనిపించింది అతనికి. అయితే అంతలోనే భూతంవాడు లేచి, చెంబుని పట్టుకొని, గట్టిగా కళ్ళు మూసుకొని, వణికాడు "ఉహుహుహుహు" అంటూ. మరుక్షణంలో వాడక్కడ లేడు!

అకస్మాత్తుగా ఆరోగ్యంగాను, బలంగాను తయారైన రామయ్యని చూసి, అతని భార్య కొంచెం ఆశ్చర్యపడింది గానీ, "కొత్త ఆరెంపీ డాక్టరు ఇచ్చిన మాత్తర్లు అంత బాగా పని చేసినాయి" అనుకుని ఆమె ఎప్పటిమాదిరే రామయ్యకు పనులు పురమాయించటం మొదలెట్టేసింది!

ఆమెకు భూతం ఇచ్చిన బంగారం గురించీ, వజ్రాల గురించీ చెబుదామా అనుకున్నాడు గానీ, రామయ్యకి ధైర్యం చాలలేదు. 'కష్టకాలంలో పనికొస్తాయిలే' అని ఆ మూటని భద్రంగా దాచిపెట్టి, ఎప్పటిలాగే పనిలోకి దిగాడతను!

గురువు గారు: ఏరా, పక్షి మీద వ్యాసం రాయమంటే రాయలేదేం?
శిష్యుడు: అది ఎగిరిపోయింది సార్, అందుకే రాయలేకపోయాను.





# తెలివి ఎలా తప్పించుకున్నది?

*ఘనా దేశపు జానపద కథ-* *సౌజన్యం: బెట్టీ, స్టోరీ నోరీ.కామ్*

అనేక సంవత్సరాల క్రితం ఫాదర్ అనాన్సీ అనే ఒక ముసలాయన ఉండేవాడు. ప్రపంచంలో ఉండే తెలివి తేటలన్నీ ఆయన దగ్గరే ఉండేవి. జనాలకి ఏమి కావాలన్నా వచ్చి అయన్నే అడిగేవాళ్ళు: "ఫాదర్ అనాన్సీ! నా కొడుకు ప్రవర్తన బాగుండాలంటే ఏమి చేయాలి? ఫాదర్ అనాన్సీ!మా మేనత్త ఆరోగ్యం మెరుగుపడేందుకు ఏమి చేయాలి?

ఫాదర్ అనాన్సీ!నా పంట పెరగాలంటే ఏమి చేయాలి ? -ఇట్లా రోజూ వందలాది ప్రశ్నలకు ఫాదర్ అనాన్సీ సమాధానాలు చెప్పేవాడు.

ఆయన ఇచ్చే సమాధానాలకు గాను ప్రజలు డబ్బులు చెల్లించేవాళ్ళు. దాంతో ఆయన గొప్ప ధనవంతుడయ్యాడు కూడా. ఆయన కుటుంబం ఏనాడూ ఆకలితో పడుకోలేదు-

కానీ అనాన్సీకి ఒకే ఒక్క భయం ఉండేది: 'ఎవరైనా నా తెలివితేటలు అన్నింటినీ దొంగిలించుకుపోతే ఎలా?!' అని. "నాకు డబ్బుని, గౌరవాన్ని విలువని తెచ్చిపెట్టే ఈ తెలివితేటలే లేకపోతే, ఇంక నేను ఎట్లా బ్రతకాలి?" అని నిరంతరచింతన ఒకటి మొదలైంది అతనికి.



దాంతో బాగా ఆలోచించి, ఇక ఉండబట్టలేక, తన తెలివితేటలన్నింటిని ఒక కుండలో పెట్టి, ఆ కుండని అడవిలో దాచిపెట్టివచ్చేందుకని బయలుదేరాడు.

ఫాదర్ అనాన్సీకి ఒక కొడుకు ఉండేవాడు. వాడి పేరు క్వేకుజింగ్. వాడికి వాళ్ళ నాన్నకు ఉన్నన్ని జిత్తులు, తెలివితేటలు ఉండేవి. తండ్రి ఏదో రహస్య పథకం వేశాడని వాడికి అర్థమైంది- అందుకని ఆయనకు కనబడకుండా వెంబడిస్తూ పోయాడు వాడు.

అనాన్సీ ఆ పెద్ద కుండని జాగ్రత్తగా కడుపుకు కట్టుకొని అడవిలోకి పోతున్న కోద్దీ క్వేకుజింగ్ అనుమానాలు బలపడ్డాయి. రెట్టించిన ఉత్సాహంతో తండ్రిని వెంబడిస్తూ పోయాడు వాడు.

అట్లా పోయి, పోయి, చివరికి అడవిలో అన్ని చెట్లకంటే ఎక్కువ ఎత్తున్న చెట్టు ఒకదాని దగ్గర నిలబడ్డాడు అనాన్సీ. చేరే చెట్టు క్రింద దాక్కున్న క్వేకుజింగ్ అతనినే నిశ్శబ్దంగా గమనించసాగాడు. కొద్ది సేపు చెట్టు పైకి చూసిన అనాన్సీ ఒకసారి తల ఊపి, కుండతో సహా చెట్టు మీదికి ఎక్కేందుకు ప్రయత్నించసాగాడు-

కానీ తెలివితేటల కుండని కడుపుకి కట్టుకుని చెట్టు ఎక్కటం ఎట్లా? అది చాలా

కష్టమైన పని! కుండ అడ్డం పడుతుంటుంది అతనికి! అందువల్ల ఎంతప్రయత్నించినా మొదటి కొమ్మను దాటి పైకి పోలేకపోయాడు అనాన్సీ! ఇంకొంచెం ప్రయత్నించే సరికి జారి, దబ్బున నేల మీద పడ్డాడు.

ఆ దెబ్బకు "అబ్బా!" అని మొత్తుకుని కూడా, మళ్ళీ పైకి ఎక్కేందుకు ప్రయత్నం మొదలెట్టాడతను!.

అయితే ఈసారి క్రింద పడేటప్పటికి అతను రెండవ కొమ్మ వరకూ ఎక్కగలిగాడు!

అయినా పట్టు వదలని అనాన్సీ మళ్ళీ ఇంకోసారి చెట్టు ఎక్కేందుకు ప్రయత్నించాడు. అయితే దురదృష్టం, మూడోసారి కూడా క్రింద పడాల్సి వచ్చింది!

దాంతో క్వేకు సింగ్ చెట్టు చాటునుంచి బయటకు వచ్చి "నాన్నా! నేను చూస్తుండగానే మూడుసార్లు పైకి ఎక్కావు; క్రింద పడ్డావు! అయినా కుండని పొట్టకి కట్టుకుని, ఎవరైనా చెట్టు ఎక్కుతారా?! వీపుకు కట్టుకుంటే పోలేదా, ఎంత సులభంగా చెట్టును ఎక్కచ్చో గదా?! అంతమాత్రం ఆలోచన లేదా?!" అన్నాడు.



అనాన్సీకి విపరీతమైన కోపం వచ్చింది. "నా ఈ తెలివితేటలు అన్నిటి నుండి ఏం లాభం వచ్చింది?! వేలెడంత లేని నా కొడుకు కూడా నాకు సలహాలు ఇస్తున్నాడే! ఇంత చిన్న పనిని కూడా నాకంటే బాగా చేయడం వాడికి తెలుసంటే, ఇక నా యీ తెలివి తేటలు అన్నీ వృధాయే కదా?!" అని అతనికి చాలా విచారమూ, ఉక్రోషమూ వచ్చాయి.

ఆ కోపంలో తన కడుపుకు కట్టుకున్న

కుండను తీసి గట్టిగా నేలమీదికి విసిరి కొట్టాడు.

"మరుక్షణం ఆ కుండ ముక్కలు చెక్కలైంది! అతను అందులో దాచిన తెలివి తేటలన్నీ తప్పించుకున్నాయి! ప్రపంచంలో అవన్నీ ఏవి-ఎక్కడికి-ఎన్ని చేరుకున్నాయో ఎవ్వరికీ తెలియదు!

అందుకనే, పైకి అట్లా కనిపించకపోయినా సరే, ప్రపంచంలో ఇప్పుడు నిజంగానే ఇన్ని తెలివితేటలున్నాయి!

వస్తువులను సంరక్షించుకోవడం, పనులను సాధించుకోవడం ఇవన్నీ జనాలకి తెలుసు! ఎప్పుడు- ఏది- ఎట్లా- చేస్తే మంచిది; అనే తెలివితేటలన్నీ జనాలకి దొరికిపోయినై!

'తన కోపం-తన శత్రువు' అని ఎవరో అన్నారుగానీ, సరిగ్గా అన్నట్లు లేదు- ఫాదర్ అనాన్సీకి అంత కోపం రాకపోతే, తన కుండని అట్లా విసిరి కొట్టకపోతే, ప్రపంచానికి ఇంత మేలు జరిగేనా, అసలు?!







# సాహసం

*రచన: అఖిల్ కుమార్, ఇంటర్ మీడియట్, భవాని పురం, విజయవాడ.*

ఆ రోజు ఆదివారం. రాజుకు బడి లేదు. "ఆడుకుందాం, వస్తావారా?" ఇంటి బయటికొచ్చి పిలిచాడు రవి. రవి, రాజు మంచి స్నేహితులు. ఇద్దరూ ఐదో తరగతి పిల్లలే.

"గ్రౌండుకి వెళ్ళి ఆడుకొని వస్తానమ్మా!" వాళ్లమ్మకు వినబడేట్లు అరిచి, అమ్మ ఏమన్నదో వినకుండానే బయటికి పరుగెత్తాడు రాజు.

గ్రౌండులో రవి, రాజు దాగుడు మూతలు ఆడటం మొదలెట్టారు. రాజు దాక్కునేందుకు వెళ్లి, దగ్గర్లో ఉన్న ఓ చెట్టు మీదికి ఎక్కి, కొమ్మల్లో దాక్కొని కూర్చున్నాడు.

రవి అతని కోసం వెతుకుతున్నాడు- ఓ కట్టె పుల్లతో తన దారికి అడ్డం వచ్చిన వస్తువునల్లా ఎత్తి పక్కకు పడేస్తూ.



అక్కడొక ప్రక్కగా అతనికో ఉండ చుట్టిన కాయితం కనిపించింది. కట్టెపుల్లతో దాన్ని కొట్టాడు. అది పైకి ఎగిరి, అవతల పడింది. రవి ఈసారి దాని దగ్గరికి వెళ్ళి మళ్ళీ కొట్టబోతూ, యథాలాపంగా వంగి, ఆ ఉండని విప్పి చూసాడు-

"నన్ను కాపాడండి ప్లీజ్! ఎవరైనా!" అని గజిబిజి అక్షరాలలో రాసి ఉంది అందులో!

"ఒరే! రాజూ! ఇది చూడరా! ఒరే! దీనిలో ఏదో రాసి ఉంది!" హడావిడిగా అరిచాడు రవి.

వాడి గొంతులోని మార్పును గమనించిన రాజు చెట్టు మీది నుండి క్రిందికి దిగి వచ్చాడు "ఏమైంది? ఏమున్నది అందులో?!" అంటూ.

దాన్ని చదివి, "ఈ కాగితం ఎప్పటిదో మరి?! దీన్ని రాసిన వాళ్ళు ఇంకా బ్రతికి ఉన్నారో లేరో?!" అన్నాడు రాజు నిట్టూరుస్తూ, పెద్ద పోలీసువాడిలాగా మొహం పెట్టి.

"కాగితం ఉండ కొత్తగానే అనిపిస్తున్నది. రైటింగు చూస్తే ఎవరో పిల్లవాడిది లాగానే ఉన్నది. వాడు ఇక్కడికి దగ్గర్లోనే ఎక్కడో, ఏదో కష్టంలో ఉండి ఉంటాడు" అన్నాడు రవి, తనూ ఆలోచిస్తూ.

"ఇక్కడ ఎక్కువ ఇళ్ళు లేవు. పాడు బడిన భవనాలు నాలుగైదు ఉన్నాయి. దొంగలూ, తాగుబోతులూ తిరుగుతుంటారు అక్కడ- దీన్ని రాసిన పిల్లవాడెవరో వాటిలో ఉండచ్చని

నా అనుమానం. రా! పోయి వెతుకుదాం" అన్నాడు రాజు, ముందుండి దారి తీస్తూ.



పిల్లలిద్దరూ అక్కడికి దగ్గర్లో ఉన్న ఇళ్ల తలుపులు కొట్టి, "అంతా బాగున్నారు కదండి?!" అని అడగటం మొదలు పెట్టారు.

"ఏమి, అట్లా ఎందుకు అడుగుతున్నారు?" అని అనుమానంగా చూసారు కొందరు.

"ఇట్లా చాలా సమయం వృధా అవుతున్నది. మనం చూడాల్సింది ఇళ్లలో కాదు. ఆ పాడుబడ్డ భవనాలలో!" అన్నాడు రాజు.

"నాకు భయం బాబూ!" అన్నాడు రవి.

"నాకూ భయమేలేరా, కానీ తప్పదు. ఎవరో పాపం, కష్టాల్లో ఉన్నారు. మనం కాపాడాలి!" అంటూ వాడి చెయ్యి పట్టుకొని అటువైపు నడిచాడు రాజు.

వాళ్ళకు కనిపించిన మొదటి పాడుబడిన ఇంటి గోడకే ఒక కన్నం ఉంది. ఇద్దరూ చప్పుడు చేయకుండా వెళ్ళి, ఆ కన్నంలోంచి లోపలికి చూసారు..

అక్కడ నిజంగానే ఎవరో పిల్లవాడు ఉన్నాడు! ఎవరో వాడిని అక్కడున్న కుర్చీకి కట్టిపడేశారు. వాడి కాళ్లు చేతులు కట్టివేసి, మూతికి ప్లాస్టర్ వేసి ఉంచారు. వాడు తప్పిస్తే ఆ ఇంట్లో ఎవరూ ఉన్నట్లు లేరు- ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది!

రాజు, రవి వెంటనే ఆ కన్నంలోంచి ఇంటి లోపలికి ప్రవేశించారు. వాళ్ళని చూడగానే ఆ పిల్లవాడి కళ్ళు మెరిసాయి. కుర్చీలోనే గింజుకోవటం మొదలెట్టాడు. రాజు వెంటనే

ఆ పిల్లవాడి నోటికి వేసిన ప్లాస్టర్ పీకేసి, "ఎవరు నువ్వు? ఏమైంది?" అని అడిగాడు.

పిల్లాడు చెప్పాడు- "నా పేరు బాబు. పితాపురంలో నాలుగో తరగతి. నేను ఇవాళ్ల ఉదయం రోడ్డు మీద నడుస్తుంటే ఎవరో ఇద్దరు దొంగవాళ్ళు వచ్చి, నా మెడమీద గట్టిగా ఒక్క దెబ్బ వేసారు. తర్వాత తెలివి వచ్చి చూసే సరికి నేను ఓ కారులో ఉన్నాను! అయితే అదృష్టం కొద్దీ నా దగ్గర పెన్ను, పేపరు ఉండినై. దొంగలకి కనబడకుండా నేను 'నన్ను కాపాడండి' అని రాసి, ఆ కాయితాన్ని కారులోంచి బయటికి విసిరేసాను. 'దాన్ని చూసి ఎవరైనా రాకపోతారా, నన్ను కాపాడకపోతారా' అని ఎదురు చూస్తున్నాను. దొంగ కిడ్నాపరు-గాళ్ళు ఇద్దరూ నన్ను ఇక్కడ కట్టి పడేసి, ఇప్పుడే, బయటికి వెళ్ళారు" చెప్పాడు వాడు.

రాజు రవి ఇద్దరూ ఆలోచించారు. "ఇదిగో, నువ్వు ఇక్కడే కూర్చో! భయపడకు! మేం వెంటనే వచ్చేస్తాం!" అంటూ పోలీసు స్టేషనుకు పరుగు పెట్టారు; త్వరత్వరగా పోలీసులను పిలుచుకొచ్చారు.

పోలీసులు ఆ పాడు బడ్డ ఇల్లంతా తిరిగి చూసి, "మంచి పని చేసారు. వీడిని ఇట్లాగే కుర్చీలో ఉండనిద్దాం" అని ఆ ఇంట్లో అన్ని మూలలా మాటు వేసారు.

కొద్ది సేపటికి కిడ్నాపర్లు ఇద్దరూ తిరిగి వచ్చారు. "వీడి నాన్న బలే పిసినారిరా! కోటి రూపాయలు ఇమ్మంటే, చూడు పది లక్షలు ఇస్తానంటున్నాడు" అని మాట్లాడుకుంటూ ఇంటి లోపలికి అడుగు పెట్టారు.

మరుక్షణం పోలీసులు వాళ్లను చుట్టుముట్టారు. అంతమంది పోలీసులను చూసిన దొంగలిద్దరూ అవాక్కైపోయారు. చప్పుడు చేయకుండా లొంగిపోయారు. పోలీసులు వాళ్లకు బేడీలు వేసి స్టేషనుకు తీసుకు వెళ్లారు.

ఆ తర్వాత పోలీసులు, ఊళ్ళోవాళ్ళు, పితాపురం వాళ్ళు, అందరూ రవిని, రాజును ఎంత మెచ్చుకున్నారో చెప్పలేం!



# ప్రాప్తం

*రచన: శ్రీ చొప్ప వీరభద్రప్ప, అనంతపురం.*

అనగనగా సుందరయ్యఅనే జాలరి ఒకడు ఉండేవాడు. పెద్ద నది మధ్యలో, సుడిగుండాల ప్రాంతంలో చేపలు పట్టేవాడు అతను. ఆ ప్రాంతానికి పోవాలంటే వేరే జాలర్లు అందరూ భయపడేవాళ్ళు. అట్లా ఎవ్వరూ పోయేందుకు సాహసించని చోట్ల తానొక్కడే చేపలు పట్టడం వల్ల, అతనికి చేపలు బాగా దొరికేవి. అట్లా సుడిగుండాలంటే భయపడని సుందరయ్యను తోటి జాలర్లు ముద్దుగా 'సుడిగుండయ్య' అని పిలవటం మొదలెట్టారు.

సుడిగుండయ్య చాలా తెలివైన వాడు. నది ఉధృతంగా ప్రవహిస్తున్నప్పుడు కూడా, సుడిగుండం తనను లోపలికి లాక్కోకుండా రకరకాల ఉపాయాలు పన్నేవాడతను.

ప్రమాదకరమైన సుడిగుండాలలోకి జొరబడేటప్పుడు, ముందుగా నది ఒడ్డున నేలలోకి ఒక గుంజను పాతేవాడు. దానికి పొడవాటి మోకును ఒకదాన్ని కట్టేవాడు. ఆ మోకు రెండో చివరను తన పడవకు కట్టేవాడు. ఎప్పుడూ ఆ తాడు పరిధిలోనే చేపలను వేటాడేవాడు.



ఒకనాడు నదిలో చేపలు పట్టే బెస్తవాళ్లను వెతుక్కుంటూ కొందరు రాజభటులు వచ్చారు. "మా రాజు గారికి ఒక రకం పక్షవాతం వచ్చింది. అది నయం కావాలంటే అయన చేతికి వెండి చేప రక్తం పూయాలి; కాలికి బంగారు చేప రక్తం పూయాలి అని వైద్యులు చెప్పారు. మీరు ఎప్పుడూ నదిలోనే తిరుగుతుంటారు కాబట్టి, అట్లాంటి చేపలు మీకేమైనా నదిలో దొరుకుతాయేమో చూడండి. వాటిని పట్టుకొచ్చి రాజు గారికి ఇచ్చారంటే, వెండి చేప పట్టి తెచ్చిన వారికి వెండి పడవ; బంగారు చేప పట్టి ఇస్తే వారికి బంగారు పడవ బహుమానంగా ఇస్తారు!" అని చాటించి పోయినారు.

ఇది విన్న సుడిగుండయ్య భార్య అతనితో "మామా! విన్నావు కదా! ఈసారి నువ్వు అట్లాంటి చేపలు పట్టుకురావాలి!" అన్నది. "మనం ఆ పడవలమ్మి, ఊర్లో మంచి ఇల్లు

కొనుక్కొని హాయిగా బతుకచ్చు!"

సుడిగుండయ్య నవ్వి "ఓసి పిచ్చి ముఖమా! వెండి పడవ, బంగారు పడవల్లో చేపలు పడితే

మన గురించి అందరు గొప్పగా చెప్పుకుంటారు. అప్పుడు నా విలువే, వేరుగా వుంటుంది. వాటిని అమ్మితే ఏమొస్తుందే?" అన్నాడు. వాళ్ళిద్దరి మధ్యా ఆ చర్చ తెగలేదు కానీ, ఆనాటి నుండి సుడిగుండయ్య మామూలు చేపలు పడుతూనే, ప్రత్యేక దృష్టితో వెండిచేప కోసమూ, బంగారు చేప కోసమూ వెతకటం మొదలు పెట్టాడు.



అనుకోకుండా ఒకరోజు అవి అతని కంట పడ్డాయి! చాలా కష్ట పడగా, అతి ప్రయత్నం మీద ఒక్క వెండి చేప మాత్రం అతని వలలో పడింది. బంగారు చేప దూరంగా పారిపోయి తప్పించుకొని కూడా నీళ్ళలోంచి తాటి చెట్టంత ఎత్తుకు ఎగిరి దూకుతూ ఏవేవో వింత శబ్దాలు చేసింది. చేప అలా అరవటం విని సుడిగుండయ్య చాలా ఆశ్చర్యపడ్డాడు; కానీ అంతలోనే పెద్ద పెద్ద రెక్కలున్న భైరవడేగ ఒకటి ఎక్కడినుండో వాయు వేగంతో వచ్చి చేరుకొని, సుడిగుండయ్య చుట్టూ గిరగిరా తిరుగుతూ అతనితో "సుడిగుండయ్యా! ఆ వెండి చేపను వదులు!" అన్నది.

దాని రెక్కల విసురుకు నదిలో అలలు రేగి సుడిగుండయ్య పడవ అల్లల్లాడింది. సుడిగుండయ్యకు కొంచెం భయం వేసినా, గట్టిగా నిలబడి "అది నాకు దొరికింది. దాన్ని నేను ఎందుకు వదులుతాను?! నువ్వెవరు, నాకు చెప్పడానికి? దీన్ని తీసుకెళ్ళి నేను రాజుగారికి ఇస్తే, ఆయన నాకు వెండి పడవ ఇస్తాడు. మరి దీన్ని వదిలేస్తే నువ్వేమిస్తావో చెప్పు?!" అన్నాడు.

"నీ పడవకు సరిపోయే వెండిని నేనిస్తాను సరేనా? ఈ చేపను వదిలేసెయ్యి చాలు!"అన్నది భైరవడేగ.

సుడిగుండయ్య కొంచెం సేపు ఆలోచించి "సరే" అన్నాడు.



భైరవ డేగ ఎక్కడికో వెళ్ళి, పెద్ద వెండి ముద్దను కాళ్ళ మధ్య ఇరికించుకొని తెచ్చింది. "ఇదిగో, ఈ వెండి కల్తీ లేనిది; స్వచ్ఛమైనది. రాజుగారు నీకిచ్చే వెండికంటే చాలా విలువైనది ఇది. దీన్ని ఇప్పుడే నది గట్టున పెడుతున్నాను. తీసుకో. చేపను వదిలెయ్యి!" అన్నది.

సుడిగుండయ్య వెండిముద్దను తీసుకొని వెండి చేపను నదిలోనే వదిలేసాడు. ఆ వెండిని మొత్తాన్నీ అమ్మి, సుడిగుండయ్య భార్య డబ్బు చేసుకున్నది. ఆ డబ్బుతో పెద్ద ఇల్లు కట్టించింది కూడా. అయితే అప్పటి నుండి ఆమె ప్రతి రోజూ 'ఈసారి బంగారు చేపను పట్టు' అని భర్తకు గుర్తు చేస్తూనే ఉంది. సుడిగుండయ్యకూడ బంగారు చేపకోసం గట్టి ప్రయత్నం చేసాడు. నిజంగానే బంగారు చేప పడింది కూడాను, అతని వలలో!

అయితే ఈసారి కూడా ముందుసారి లాగానే జరిగింది. వెండి చేప గాలిలోకి ఎగిరి ఏమేమో శబ్దాలు చేసింది. ఆ శబ్దాలు వింటూనే భైరవ డేగ వచ్చింది. గతంలో లాగే సుడిగుండయ్యతో "అయ్యా! నువ్వు కోరినంత బంగారాన్ని నేనిస్తాను. మా బంగారు చేపను మాత్రం వదిలిపెట్టు!" అన్నది.

అతడు సమ్మతించాడు. డేగ ఎక్కడి నుంచో ఈసారి పెద్ద బంగారు ముద్దను తెచ్చి, నది గట్టున పెట్టింది. సుడిగుండయ్య ఆ బంగారు ముద్దను చూసి సంతోషించి, చేపను వదిలేస్తూ బైరవ డేగతో "నీకు, ఈ చేపలకు ఏమిటి సంబంధం?" అని అడిగాడు.

"అయ్యా! అవి రెండూ నా ప్రాణ దాతలు. నేను చిన్నపుడు ఈ నదిలో పడి, కొట్టుకొని వచ్చి, ఈ సుడిగుండంలో పడిపోబోయాను. ఆ సమయంలో ఈ రెండూ నన్ను కాపాడి నది గట్టుకు చేర్చాయి. నేను వీటికోసం నా ప్రాణాలైనా ఇవ్వగలను" అన్నది.

సుడిగుండయ్య "ఓహో!" అని బంగారాన్నంతా ఇంటికి తీసుకుపోయి, భార్యకు ఇచ్చాడు. భార్య ఆ బంగారాన్నంతా అమ్మి ఎంత సొమ్ము చేసుకున్నదంటే, ఇక ఆ డబ్బు వాళ్ల కొత్త ఇంట్లో కూడా పట్టలేదు! దాంతోఆమె అతనితో "ఇప్పుడు మన దగ్గర చాలా డబ్బుంది కదా; ఇంక మనం ఇక్కడ ఉండటం క్షేమం కాదు- పట్టణానికి పోయి సుఖంగా ఉందాం" అన్నది.

అంత డబ్బు వచ్చినా సుడిగుండయ్య ఆశ చావ లేదు. "ఈ సారి ఆ రెండు చేపలనూ పట్టుకొని రాజుగారికిస్తాను. ఆయన రోగం నయమౌతుంది. నన్ను సన్మానిస్తారు. వెండి పడవ, బంగారు పడవ కూడా ఇస్తారు. ఒక్కో రోజున  ఒక్కొక్క పడవలో నదికి పోతాను!" అన్నాడు.

అమె నవ్వి, "మామా! దురాశకు పోకు! మన దగ్గర ఇప్పటికే చాలా డబ్బున్నది. దాన్ని కాపాడుకోవడమే  కష్టం. ఉన్న డబ్బును ఎలా రక్షించుకోవాలో చూడకనే, ఇంకా డబ్బు సంపాదించే ఆలోచన ఎందుకు చేస్తావు? మనం ఇక్కడ ఉండటం ప్రమాదకరం- నిజంగా చెబుతున్నాను- 'వేరే ప్రాంతానికి వెళ్ళిపోదాం' అన్నది.

సుడిగుండయ్య ఒప్పుకోలేదు. మళ్ళీ పడవనెక్కి చేపల కోసం నదిలోకి పోయాడు. అతడనుకున్నట్లే ఈసారి  బంగారు, వెండి చేపలు రెండూ అతని వలలో పడ్డాయి.

"ఇప్పుడు ఎవరు పిలుస్తారు, మీ స్నేహితుడిని?" అని ఎగతాళిగా నవ్వాడు సుడిగుండయ్య.

అయితే అవి రెండు వలలోనే గట్టిగా గింజుకులాడుతూ అరిచే సరికి భైరవడేగ రానే వచ్చింది. అది అన్నది, "అయ్యా! నేను నీకు కావలసిన దాని కంటే ఎక్కువగానే వెండి బంగారాలు ఇచ్చాను గదా, మళ్ళీ మా వాళ్ళను ఎందుకు పట్టుకున్నావయ్యా?! మొదట ఇచ్చిన దానికి రెట్టింపు వెండి బంగారాలు ఇస్తాను. వీటిని వదిలిపెట్టు! మళ్ళీ ఎప్పుడూ పట్టుకోనని మాట ఇవ్వు!" అన్నది.

సుడిగుండయ్య ఒప్పుకోలేదు. "అట్లా కుదరదు. ఎన్ని సార్లు పట్టుకుంటాననేది నా ఇష్టం. ఈ చేపలను పట్టుకొని రాజుగారికి ఇస్తే అయన నన్ను సన్మానిస్తాడు. నువ్వు ఇచ్చేదానికంటే చాలా ఎక్కువ ఇస్తాడు!" అన్నాడు.



భైరవ డేగకు చాలా కోపం వచ్చింది. "చివరి అవకాశం ఇస్తున్నాను. పట్టు వదుల్తావా లేదా?!" అన్నది.

సుడిగుండయ్య అడ్డంగా తల ఊపాడు. "ఇంకా బెట్టు చేస్తే మరింత డబ్బు వస్తుంది!" అనుకున్నాడు.

అయితే భైరవ డేగ ఈ ఆశబోతుతో ఇంక బేరం చేయదల్చుకోలేదు. చటుక్కున ఆకాశానికి

ఎగిరిందది. వేగంగా వచ్చి, అతను నది ఒడ్డున నేలలో నాటిన కర్రను తన కాళ్ళతో లాగి పారేసింది! తాడు సాయం లేని పడవ పట్టు తప్పింది. సుడిగుండంలో చిక్కుకొని గిరగిరా తిరగటం మొదలెట్టింది.

ప్రాణభయంతో 'కాపాడ'మని అరిచాడు సుడిగుండయ్య. చివరి నిముషంలో కోపం చల్లారిన డేగ అతన్ని కాపాడేందుకు ప్రయత్నించింది గానీ, ఫలితం లేకపోయింది. సుడిగుండయ్య సుడిగుండంలో కలిసిపోయాడు. వలతో పాటు పైకి తేలిన చేపలను భైరవడేగ వలలోంచి తప్పించింది.

వచ్చిన అవకాశాన్ని మంచి మనసుతో సద్వినియోగం చేసుకుంటే సరేగాని, దురాశతో బెట్టు చేస్తే మటుకు మొదటికి మోసం వస్తుంది.

రాము: ఏంట్రా ఆటల పోటీల్లో పాల్గొని దెబ్బలు తగిలించుకున్నావా?
రాజు: గ్రౌండుకు వెళ్లేటప్పుడు లాఠీఛార్జ్ జరిగిందిరా. ఇవన్నీ పోలీసువారిచ్చిన బహుమతులు!

క్లీనర్: సార్ వాటర్ క్లీనింగ్ స్పీడుకే మీ కారు గాలికెగిరిపోయింది. ఎంత పెట్టి కొన్నారు?
ఓనర్: ఫారెన్ కారు ఖరీదు కోటిన్నర...?
క్లీనర్: ఇండియాలో నీళ్ళు నచ్చక ఫారెన్ పోయుంటుంది.



రోగి : డాక్టర్ గారూ! మీరు రాసిచ్చిన మందులన్నీ వేసుకుంటున్నా రోగం తగ్గట్లేదు; పైపెచ్చు ఇంకా ఎక్కువవుతున్నది.. ఎందుకంటారు?
డాక్టర్: నువ్వు తీసుకున్నది లైఫ్ కార్డు బాబూ. కాబట్టి జీవితాంతం నీ రోగం పెరుగుతూనే ఉంటుంది; నేను నీకు మందులు రాసిస్తూనే వుంటాను.

# బొమ్మలు - పదాలు 4

***రెండో తరగతి పిల్లలకు ప్రత్యేకం :*** *ఇక్కడ ఎనిమిది బొమ్మలున్నై. ఒక్కో బొమ్మనుండీ* ***రెండు-లేక-మూడు అక్షరాల పదాలు*** *తయారవుతాయి- చూడండి. వింత ఏంటంటే ఆ ఎనిమిది పదాలూ 'ఈ ' తోటే మొదలౌతున్నై! బొమ్మల్ని చూసి పదాలు కనుక్కోండి మరి !*

*నిర్వహణ : శ్రీమతి ఆదూరి హైమావతి, అమెరికా సంయుక్త రాష్ట్రాలు*



*1*



*2*



*3*



*4*



*5*



*6*




*7*



*8*

"బొమ్మలు-పదాలు 1 నుండి బొమ్మలు-పదాలు 6" వరకూ వచ్చిన పదాలన్నీ దాచి పెట్టుకోండి. చివరికి, అన్నిటినీ ఓ పోస్టు కార్డు మీద రాసి పంపాలి మాకు! అట్లా అన్నీ సరిగా రాసి పంపిన **రెండో తరగతి పిల్లల్లో** లాటరీ ద్వారా ఎంపికైన **ఇద్దరికి** - ఒక్కొక్కరికీ 500 రూ. బహుమతి ఇవ్వబడుతుంది !

# బొమ్మకు కథ రాయండి

ఈ చిట్టిది ఏమని ప్రార్థిస్తున్నదో కదా?

"దేవుడా !... నేను ఎబిసిడి కాన్వెంటులో యల్కేజీ చదువుతున్నాను... నాకు తెలుగు చాలా కష్టం... ఇంగ్లీషు కూడా కష్టమే... మా అమ్మ వాళ్ళు నన్ను ఐఐటీ చదవమంటున్నారు.... నాకేమో పరీక్షలు దగ్గరకొచ్చేసినై దేవుడా ! నాకు మాత్రం ఎలాగైనా ఫస్టు ర్యాంకు తెప్పించు దేవుడా... " అంటోందా ? ఇంకేదైనా అంటోందా? ఈ పాప ఏమంటున్నదో మాకు రాసి పంపండి. చక్కగా రాసిన నాలుగు కథనాలను కొత్తపల్లి-92 లో ప్రచురిస్తాం !



కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి , అనంతపురము జిల్లా, ఆంధ్రప్రదేశ్-515101.

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**పడవ, బంగారము, తరగతి, చలాకీ, కుక్క, పిల్ల, వినాయకుడు, దయ్యాలు, వయసు, పరీక్షలు, రూపాయలు, రాఘవయ్య, కుళాయి, అంగడి, ఊపిరి, సంతోషం, సానుభూతి, పదిహేడు, రెండువేలు, రెండోవాడు, అవసరం :-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బం | య్యి | త | ర | గ | తి | భూ | ను | సా | తో | చ | య్యి |
| డో | ల్ల | రం | క్ష | సు | హే | య్యి | తి | హే | ళా | లా | భూ |
| క్ష | రెం | స | య | లు | లు | వే | డు | రెం | య్యి | కీ | రెం |
| ఘ | రం | వ | ల్ల | య | క్ష | బం | క్క | షం | డో | డు | బం |
| డి | భూ | అ | పి | పా | రీ | డో | ఊ | ల్ల | హే | వా | హే |
| గ | తి | క్ష | క్క | రూ | ప | య్యి | ససం | రి | తో | రం | డు |
| అం | డో | క్క | కు | ప | డ | వ | రెం | ఘ | పి | కు | డు |
| కీ | ళా | షం | ది | భూ | ళా | య్యి | షం | హే | య | ఊ | నా |
| క్క | ది | హే | లు | ల్ల | వ | క్ష | ము | నా | య | య్యి | రం |
| రెం | డు | వే | క్ష | ఘ | బం | ర | వి | య | డు | తి | సు |
| లు | ఊ | క్ష | రా | తి | గా | ఊ | యి | ళా | కు | భూ | రం |
| బం | లు | య్యి | ద | బం | క్క | షం | రెం | య | షం | తో | సం |

# పదరంగం-90

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | | ★ | 3 | 4 |
| 5 | | ★ | 6 | ★ | |
| | ★ | 7 | | 8 | ★ |
| 9 | 10 | ★ | 11 | | 12 |
| 13 | | 14 | ★ | 15 | |
| | ★ | 16 | | | ★ |

**అడ్డం:**

1. పల్లెల్లో జరిగే ఒక ఉత్సవం (3)

3. 'పాము'కి మరో పేరు (2)

5. నదులు, సముద్రాలు నేలను తాకే చోటు (2)

7. మన భాష! (3)

9. 'ప్రగతిపథం' పదంలో 'దారి' (2)

11. పట్టణం! (3)

13. నక్షత్రం, మరో విధంగా (3)

15.మట్టితో చేసిన పాత్రలో పచ్చళ్ళు నిల్వ చేస్తారు(2)

16. మన ముఖంలో, కదలిక గల ఎముక(3)

**నిలువు:**

1. National Flag ని తెలుగులో ఇలా పిలుస్తాం (6)

2. 'నవతరం' లో చివరి రెండు అక్షరాలు (2)

4. తిరగబడిన 'దర్పం' (2)

5. 'తెలుపు' కి వ్యతిరేక పదం (3)

8. 'దేశము ప్రేమించుమన్న' అప్పారావు గారి ఇంటి పేరు(4)

10. తిరగబడిన 'రథం' (2)

12. గుడి దీర్ఘం చేరిన ముడి (2)

14. ఒత్తు లేని కధ (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 92 ని బహుమతిగా పంపిస్తాం!

## Form IV

*Statement about ownership and other particulars about newspaper* **Kottapalli** :

1. Place pf publication: Kottapalli Prachuranalu, 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
2. Periodicity of publication: Monthly
3. Printer's Name : Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
4. Publisher's Name: Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
5. Editor's Name: Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
6. The Names and Addresses of individuals who own the newspaper and partners or shareholders holding More than one percent of the total capital:
   Dr. Samatha Potu, President, Satya- Foundation For A Healthy Society, 'Sri Krupa', Near Bus Stand, Chennoor, Adilabad District, Telangana State- 504201

**I, Narayana Sarma G.V. hereby declaere that the particulars given above are true to the best of my knowledge and belief.**

**Date:** 05-03-2017 **Signature Of the publisher:** Narayana

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 Set | 11 | 11 | 220 |
| 2 | 2012 Set | 12 | 12 | 240 |
| 3 | 2013 Set | 7 | 3 | 175 |
| 4 | 2014 Set | 10 | 403 | 250 |
| 5 | 2015 Set | 7 | 914 | 175 |
| 6 | 2016 Set | 8 | 1178 | 200 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 05/03/2017 Postal Regn No: HDP/008/2015-2017

# జాంపండ్లు

అనగనగా ఒకప్పుడు పెద్దవాళ్ళు కథలు చెప్పేవాళ్ళు. పిల్లలు వినేవాళ్ళు.




అయితే రాను రాను పెద్దవాళ్ళు పనుల్లో మునిగిపోయారు. జీవికలన్నీ బ్రతుకుతెరువులు ఐపోయినై. ప్రపంచపు బరువులూ బాధలూ అన్నీ వాళ్లను వంచేసినై; దేశాలు పట్టుకొని తిరిగేట్లు చేసినై. తొందరగా ముసలివాళ్ళు అయ్యేట్లు చేసినై. సొంత ఊరు ఉన్నది కేవలం చెప్పుకునేందుకు ఐపోయింది. ఎవరికైనా చెబుదామంటే కథలేవీ గుర్తుకు రావట్లేదు వాళ్లకు... అందుకని ఇప్పుడింక పిల్లలే సొంతంగా కథలు చెప్పటం మొదలెట్టారు! 'మీరు చెప్పకపోతేనేం, మేం చెబుతాం' అంటూ రంగంలోకి దిగారు.

"మాలో చైతన్యాన్ని నింపిన మా ఏరు 'మానేరు'కు, మాకు చిరునామా నిచ్చిన మా ఊరు 'ముస్తాబాదు'కు అంకితం" అంటూ తమవైన 'జాంపళ్ళలాంటి' కథలు చెప్పుకొచ్చారు.

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల- ముస్తాబాదు అధ్యాపక బృందం ఆ కథలకో రూపాన్నిచ్చి, పిల్లలు సొంతంగా వేసిన బొమ్మలతో, దుండ్రపల్లి బాబు వేసిన చక్కని ముఖచిత్రంతోటి 112 పేజీల పుస్తకంగా వెలువరించింది!

"ప్రభుత్వ బడుల్లో పిల్లలు ఎలుకల పందాల్లో కొట్టుకుపోవట్లేదు- చక్కని గాలిని పీలుస్తున్నారు. హాయిగా చదువుకుంటున్నారు. తమలోని సృజనను ఆవిష్కరించుకుంటూ గొప్పగా ఎదుగుతున్నారు. నిస్సారమైపోతున్న పెద్దల సమాజానికి భవిష్యత్తులో వీళ్ళే గొప్ప ఆస్తులు అవ్వబోతున్నారు" అని నిరూపిస్తున్నారు ఈ పిల్లలు.

ఈ పుస్తకం అధ్యాపక లోకానికో స్ఫూర్తి అవుతుందనీ, పిల్లల ప్రపంచపు చిరుగాలులతో పెద్దలంతా సేద తీరుతారనీ, మరెందరో పిల్లలకు ఈ పుస్తకం ఓ దారి చూపిస్తుందనీ నమ్మకంగా అనిపిస్తున్నది.

అంతా చదవాల్సిన పుస్తకం ఇది! ప్రతులకు, వివరాలకు సంప్రతించండి: అశోక్ సార్: 9849649101.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.